జీవిత సమస్య లన్నింటిమీద శాస్త్రీయ దృక్పథంతో వ్రాయబడిన అనువదించబడిన పుస్తకాలు కావాలి. రచయితలు తమ రచనలను పంపిన సంతోషింతుము. వివరాలకు వ్రాయ ప్రార్థితులు.

# ప్రేమలేఖలు

పాండేయ బేచనశర్మ
(ఉగ్రజీ)

అనువాదం
"శర్మ"

విజ్ఞాన సాహిత్యవనం
బెజవాడ

సంపాదకుడు

చలసాని రామారాయ్

ప్రచురణ ౧౭

ప్రథమ ముద్రణ

1948

వాణీప్రెస్, బెజవాడ.

Q. H. K. 62 D.

4

మిసెస్ ఆలీహుసేన్,
C/o ఖాన్ బహాదూర్ మహమద్
హుసేన్, హజరత్‌గంజ్, లక్నో.

గరల్స్ కాలేజీ హాస్టల్,
కలకత్తా
28—11—25

ప్రియమైన బీబీ,

బీబీ అంటే నీకు కోపమొస్తుందని నాకు తెలుసు. నాచేత ఒదినె అనిపించుకోవా లంటావు. నీవు నా అమాయకపు సోదరుని మెడను తగులుకొన్నప్పటినుంచి (క్షమించాలి) నా ముఖాన్ని నీ రెండుచేతుల్లోకి తీసుకుని "బీబీ" అనేదానికి నన్నెన్నిమార్లో చంపలు వాయించి వున్నావు. దీంతో నేను నా అలవాటు వదలుకో లేదు. బీబీ చంపకాయలు చాల మధురంగా వుంటవి. నా మాటల్లో నమ్మకం లేకపోతే సోదరుని (మీవారిని) అడిగిచూడు. మరోమాట జాబులో "బీబీ" అని వ్రాసినందుకు నీ చేతులకు నా చంపల్తో సంబంధం చేయాలన్న కోరిక కలిగేట్లయితే వాటిని మీ వారి చంపల్తో కలుపు. కోపంమింగెయ్యొద్దు. వృథపోతుంది (హహహ)

రెండునెల్లవరకు నీకు ఒకజాబుకూడా—ఒట్టుపెట్టుకొనేదానికైనా రాయలేదని నీవు నన్ను మనసులో తిట్టుకొంటూ వుండొచ్చు. దీనికోశగొప్ప — నెతలనుంచి మడిమలవరకూ వ్రేలాడుతుండే వెంట్రుకలకంటేకూడా

గొప్ప - కారణముంది. వింటావా ? నీవు విన్నా వినక పోయినా లెక్కపెట్టేదెవరు ? నేను నారాజాగా వినిపిస్తా. నీకుకూడా నీ మనోవాంఛల్ని వినిపించేప్పుడు నా వినడం వినకపోవడాన్ని లక్ష్యంచేయలేదు. జ్ఞాపకముందా ?

బీబీ, హృదయంలోని మాటలు నీ యెదుట చెప్పవలసినవైనా మనసుకోరినాకూడా సిగ్గుచేత చెప్ప లేకున్నాను. జాబు వ్రాస్తున్నా. దీంతో కొంత ధైర్యం యెక్కువవుతుంది. అనవసరంగా ఎక్కువగా రాయకుం డా నేను స్పష్టంగా ఒప్పుకొంటున్నా "నేదో మేము కూడా వ్యాకులంగావున్నా"మనిన నోట వింటూండిన యే ప్రేమచర్చవుందో అది యీ నా వ్యాకులత ఆ ప్రేమ కొరకే. అప్పుడాలోచించుతుండేదాన్ని - నాజీవితం లో నా అనే ఓ వ్యక్తికొరకు నేను వ్యాకులపడు తూండడం అనేకాలమేదైనావస్తుందా? ఆసమయంలో నీమాటలు పొడుపుకథల్లాగ (కాని మనోహరంగా) తోస్తూండేవి. నేడు నేనా మనోహరమైన పొడుపుకథ-ప్రేమసుడిలో పడినట్లుతోస్తూంది. నేడు నా హృదయంలో జ్వాల రగుల్కొన్నట్లుంది. యేమిటో యేమెరుగుదును?"

గడచిన అక్టోబరునాటిమాట;-ఆరోజుమాహాస్టలు నిరీక్షణచేసే(సూపరింటెండెంటు)మిసెస్ కిడ్ హాస్టలుబాలిక లతో ఉంటూ నేడు కలకత్తాకాలేజి విద్యార్థులకు పోర్టు విలియమ్ ఆంగ్లేయులకు ఫుట్ బాల్ మ్యాచ్ జరుగు తుంది.

మీలో చూడాలనుకున్నవాళ్ళు సరిగా మూడు ఘంటలకుతయారుగావుండాలి. ఆదినం 12_15 బాలికలతో కూడా నేను మ్యాచ్ చూడటానికి వెళ్ళాను. మైదానంలో వేలకొలది తమాషా చూడవచ్చినవారు గుమి కూడారు. తెల్లవాళ్ళు తెల్లస్త్రీలు నల్లవాళ్లు (మరి నీవు తప్పనుకోకపోతే మనలాంటి నల్లస్త్రీలు) కూడా ఆట ప్రారంభించడానికి సరియైనటైముకు "రిఫరీ" బిగిల్ వూదాడు. రెండువైపులా ఆటగాళ్ళు మైదానంలోకి వచ్చారు. ఒకవైపు మోటు మోటు బూడ్సులు ఆటవుడు పులు ధరించి మచ్చల మచ్చల తెల్లని రంగుల సోల్జర్లు మరోవైపు శ్యామలవర్ణం గోధుమ రంగు బాదామి రంగు పసుపుపచ్చ రంగుల దుస్తులు గల కలకత్తా కాలేజీ విద్యార్థులు వట్టికాళ్ళతో వున్నారు - మంచిది.

ఆట ఆరంభమయింది. రెండువైపుల ఆటగాళ్లు ఏకాగ్ర చిత్తంతో తనయెదుటివాళ్ళనుఓడించే ఆలోచన లలో మునిగి వున్నారు. చూచేవాళ్ళుఒకప్పుడు బంతితీసి కొని ముందుకుపోతుండేవాడికి మరొకప్పుడు యింకొకడికి వుత్సాహం కలిగిస్తూవున్నారు. కాని_ఉశ్ దేవునితోడు. తెల్లసోల్జర్లు విచిత్రమైన చురుకుదనంతో ఆడు తున్నారు. చూస్తుండగానే వాళ్ళు కాలేజీవాళ్ళమీద మూడు గోలులు చేశేశారు. సగంకాలం (హాఫ్ టైం) అయిపోయింది. నాలుగువైపులా చర్చలు బయలుదేరినై. "వహావ్వా, వహావ్వా తుదకు దొరలే మృత్యువులా ఆడు తున్నారే?"

ఇద్దరు మా కుర్చీలముందునుంచి యిలామాట్లాడు కుంటూ వెళ్ళిపోయారు.

"కాలేజీవాళ్ళు ఓడిపోతారా యేం?"

"ఇప్పట్నుంచే భయపడుతున్నావే? ఇంనుక సగంటైముంది. హాఫ్‌టైంతర్వాత పట్టుదలగా ఆడేవాళ్లు కాలేజీ టీములో కొంతమంది ఉన్నారు. ముఖ్యంగా మురారీకృష్ణుడు వెంటనే చాలాబాగా ఆడ్తాడు" అంటూ రెండోవా డన్నాడు.

ఆ సమయాన్నే కాలేజీ ఆటగాడొకడు వారిద్దరినీ మాకు కొంచెందూరంలో నిలిపి మాట్లాడసాగాడు.

"ఈ బాలికలు గరల్స్ కాలేజీవాళ్ళా?"

వాళ్ళలో ఒకడు సమాధానం చెప్పాడు- అలాగే కనబడుతుంది. ఎందుకు? ఎవరిమీదైనా "వచ్చేసింది హృదయంమాత్రమే వుంది" అనే నిబద్ధన విషయ మేమైనా జరుగుతుందా భాయీ యాకూబ్!"

నేను మిసెస్ కిడ్ ప్రక్కనే కూర్చునివున్నా, నా వైపు చెడ్డతసంగా సైగచేస్తూ ఆ తుంటరియాకూ బిలా అన్నాడు. "కొంచె మా బొమ్మను చూడు"అని ముగ్గురూ దూరాన్నుంచి - క్రీగంటి చూపుల్తో - నా వయిపు చూశారు. నేను నాకండ్లు యింకోవైపు త్రిప్పుకున్నా. వారందరుకూడా యేమేమో వ్రేలుకుంటూ ముందు కెళ్ళారు. ఆట మళ్ళీ ప్రారంభమయింది. ఈమారు ఆట మొదలుపెట్టేదానికి ముందే కాలేజీటీం కెప్టెను పిలిచాడు.

"మిస్టర్ మురారీకృష్ణ..."

ఫార్వర్డు అనే పొడువైన తెల్లని అందమైన నవ యువకుడు కెప్టెన్ వైపు చూచి అన్నాడు.—

"బెగ్ యువర్ పార్డన్."

"బి కేర్ ఫుల్" కెప్టెన్ ఆ యువకునికి ప్రోత్సాహము కలిగిస్తూ అన్నాడు. "ట్రై యువర్ అట్మోస్ట్, డోంట్ లూజ్."

ఈమారు తమాషా చూచేవాళ్ళగుంపు పిచ్చివాళ్ళలా గొంతులు బద్దలయ్యేటట్లు అరుస్తూ మురారీ కృష్ణునికి ప్రోత్సాహం కలిగించసాగింది. ఆట మొదలు పెట్టిన అయిదునిముషాల్లోనే మురారి తెల్లవాళ్ళకు ఒక గోలు చేశాడు. నాలుగువైపుల్నుంచి చప్పట్లసందడి యెక్కువయింది. తర్వాత యిరవై నిమిషాల్లోనే మిగతా ఆటగాళ్ళ మామూలు సహాయంతో మురారీ అయిదు గోళ్ళుచేశాడు. తలప్రాణం తోకకొచ్చేటట్లు కష్టపడినా తెల్లవాళ్ళు కాలేజీ విద్యార్థులను వోడించలేక పోయారు. మేచ్ పూర్తి అయిపోయింది.

నాలుగువైపులనుంచి ప్రజలు మురారీపై మూగారు. సైనికుల ఆటగాళ్ళలో మంచి వుత్సాహవంతుడుగా కనబడుతుండే వాళ్ళ రిఫరీ, మురారిని కౌగలించుకొని "వెల్ డన్ మై యంగ్ప్లేయర్" అన్నాడు. వార్తా పత్రికలభూతాలు ధనాధనా ఆయన ఫోటోలు తీసుకో మొదలుపెట్టారు. కుర్చీనుండి లేస్తూ మిసెస్ కిడ్ మాతో

అన్నది—"కాదు, కలకత్తా లండను కాదు. అలా అయినట్లయితే యీవేళ మురారిగౌరవం చూడతగివుండేది."

తన ప్రశంసకులమధ్య సీదాసాదాగా, అందంగా సంతోషంగా నిలబడిఉండే ఆ మురారిని ఒకసారికాదు వేయిమారులు చూడతగినవాడని ఆదినం నేను అనుకున్నా. చూచాను. ఆముఖం ఎంత అమాయకంగా ఉంది— ఎటువంటి నవ్వుముఖంగల యువకుడు—ఎంత అందగాడు.

మిసెస్‌కిడ్ (మా సూపరింటెండెంటు లేక వార్డన్) అన్నది – పదండి ఆలస్యమౌతుంది. ఆమె వెనుకనే మేమంతా మా మోటారుపై వెళ్ళాము. నే నందరి వెనుక పోతున్నా. కొంతదూరం పోయాక దారిప్రక్క నిలుచున్న ఆ యాకూబ్ కనపడ్డాడు. నన్నుచూచి (నాకు వినిపించేదానికిగా) వాడిలా పాడసాగాడు.

"చూచియున్నాము యెవనిదో దుష్టమైన
ముదముచేనిండి మత్త యీ కన్నుదోయి!
కత్తెవారడె పోలిక మెరయుదాని!"

పద్యము బాగానే వుంది. కాని ఆ చదివేవాని ముఖం, ఆ ముఖంమీద భావాలు మాత్రం చాల వికారంగా ఉన్నాయి. నా శక్తిలోనే గాని వుంటేనా......

మోటారు యింకా కొంచెందూరంలో వుంది. ఇంతలో నా దృష్టి వూడిపోయిన నా బూటు దారం మీద పడింది. నేను నిలచి దాన్ని కట్టుకోవడంలో మా జట్టునుంచి వెనుకపడ్డాను. దీనివల్ల కొంతలాభమే కలి

గింది. దారం కట్టుకొని నేను బయలుదేరటానికి ముందే వెనుకకు తిరిగి చూచేసరికి కాలేజి బెంగాలి ప్రిన్సిపల్‌తో కూడ చాలమంది విద్యార్థులు వస్తున్నారు. వాళ్ళలో మురారికూడా వున్నాడు. యాకూబ్ కూడా ఆగుంపులో చేరి నావయిపు ముందుకు వస్తున్నాడు.

యాకూబ్‌ను చూచి యేవగింపుతో రెండడుగులు ముందుకు వేశాననడం సందేహంలేదు. కాని మురారి జ్ఞాపకంరాగానే నా గమనం – దాని యంతట అదే మందగించిం దనేదాంట్లోకూడ సందేహం లేదు. నేను అనవసరంగా రెండో బూటు దారంకూడ వూడదీసి కట్ట నారంభించాను. అంతా నాదగ్గరకు వచ్చేశారు. కాని ప్రిన్సిపాల్‌గారు నాలుగయి దడుగులు ముందుకు వేశారు. దారం సరిజేసి తల పైకెత్తిన నన్ను యాకూబిలా విమర్శించాడు – "యేమైనా పోగొట్టుకొన్నారా!"

ఎవడో యింకొకడు – దేవుడికే తెలియాలి – మూడో విద్యార్థితో మెల్లగా (కాని నాకు వినవచ్చేంత గట్టిగా) అన్నాడు– "హృదయాన్ని పోగొట్టుకుంది."

నేను వినీ విననట్లుగా "యెటికెట్" కోసం యాకూబుతో అన్నాను–"నథింగ్, థ్యాంక్యూ"అని; మురారీవైపు చూచి (మనసులో కొంచెం సిగ్గుపడుతూ) అన్నాను– – "కంగ్రాట్యులేషన్స్, తమరు ప్రశంసకు పాత్రులయిన ఆటగాళ్ళే."

నా ప్రశంసావాక్యాలు వినివిద్యార్థులంతా ఆశ్చర్య పడ్డారు. తరువాత యెవడైనా యేమైనా

అన్నాడో లేదో జ్ఞాపకంలేదు. నేను బహు వేగంగా మా మోటారువైపు వెళ్ళా. దారిలో మనసు పశ్చాత్తాపపడ సాగింది. నే నెంత సిగ్గులేనిదాన్ని; స్త్రీనై కూడా యింత సిగ్గులేనితనమా? పురుషులతో యిలా మాట్లాడడమా! ఇంత సాహసమా!!

కాని నే నేంచేసేది బీబీ! ఇపుడు నాకు మనసు కొస్తుంది–మనుష్యునికి ఒకప్పుడు తన శక్తికిమించి ప్రవర్తిస్తాడనే స్థితుంటుందని. ఆ స్థితినే నేను ప్రేమని తలుస్తున్నా. "పోదూ, యిదంతా మీ వూహాల కలగలుపేగాని ప్రపంచంలో ప్రేమనే పేరుగల వస్తువేదీ లేదు?" అని నేను నీ యెదుట సగర్వంగా అంటూన్న దౌష్ట్యం నేడు మాయమై పోయింది. ఆ సమయంలో నీవు నా ముఖం ముద్దు పెట్టుకొని నిట్టూర్పు విడుస్తూ చెపుతుండేదానివి–నాకు ఒక్కొక్క అక్షరం జ్ఞాపకముంది. "నా ప్రాణం, ప్రేమ అనే దేమయింది. ఇపుడు గాదు నాలుగేండ్ల తర్వాత తెలుస్తుంది. ఆ సమయాన ప్రేమ వూహాపోహాల కలగలుపయినను ఎంత విలువగలదయింది! అవసరంగా కొనుటకు తగిన వస్తువయింది. నీకే కనబడును." పూర్తిగా సరిగా జెప్పావు. స్వీకరిస్తున్నా, ఒప్పుకుంటున్నా.

వింటున్నావా, ఈ సమయాన మీ "నర్గిస్" స్మృతిలో లేదు. ఆమె కళ్ళుమూసుకొని ఒక విగ్రహారాధకుణ్ని పూజిస్తూంది. ఎప్పుడూ హృదయంతో భగవంతుని యామె మురారిని జపిస్తూంది. ఎపుడూ భగవన్మందిరం వైపు వెళ్ళనట్టి ఆమె పాదాలు మురారి యింటి

వైపు పోవుటకు స్వర్గంవేపు పోవుచున్న మాదిరి సంజ్ఞ
పిస్తున్నై. వింటున్నావా ?-

"ప్రియుని ముఖకాంతిచేతనే తనువు లక్షించు
నుటయును మనమే. పగలురాత్రు లనియెడి సుళ్ళలో ఉ
టకు సిద్ధమైయుండుటయు మనమే.

తక్కినమాటలు ఎప్పుడయినా మరల.

నీవు నన్ను చంపుకొన్నంతపట్టు. యీ విషయ
లెవరితోనూ చెప్పవద్దు. లేదా మరల నీ నర్గిస్ ము
నీవు చూడజాలవు."

నీ
నర్గి

౨

శ్రీ గోవింద హరిశర్మ,
లాటీమహల్, కాన్పూరు.

కలకత్తా కాలేజీ హాస్టల్
కలకత్తా,
19—11—25

ప్రియతమా,

రెండేళ్ళపిమ్మట వుత్తరం రాస్తున్నా. రెండే
తర్వాత "ప్రియతము"ని జ్ఞాపకంరాగానే అంధకార
ధురమై వుండే నా హృదయమందిరంలో అనంతప్ర

పూర్వమయిన స్మృతులు జాగరితమౌతున్నాయి. మన గడిచినకాలం ఆహా యెంతసుందరమయింది.

మీకు జాబు రాస్తున్నానుగదా, నేడు తప్పక మీరు స్వప్నంలో దర్శనమిస్తారు. తప్పక కలవలె మనం తరుచుగా ప్రయాగలో కలుస్తున్నమాదిరే వుండాలి. అట్లాంటి అందమయిన సాయంకాలమే, అలాగే నేను చదువుకొని తిరిగిరావడం, ఎవనిదగ్గరకో పోవడానికి తొందరగా చేతులుమొగం కడుక్కొని తయ్యారుగా వుండడం, ప్రేమతో వుప్పొంగుతూ నీవు రావడం, ఒకరొకర్ని చూచుకొని సంతోషంతో మనమిద్దరం అంతా మర్చిపోయి పెద్దగా నవ్వడం, అదేమాదిరి వుండాలె. అప్పటిలాగే చెప్పాలి – "మూలీ త్వరగా కానియ్." నేను మూతి ముడుచుకొని కోప్పడి "పో, యెవడు మూడోవాడితో తొందరగా కానియ్యమని చెప్పు" అని అనడం అలాగే—

నీవు – మూలీ, (ముల్లంగి)

నేను – (ఓ గుక్కలో) నీవు ముల్లంగి, నీవు గనుసగడ్డ, నీవు వంకాయు, నీవు పెండలం.

నీవు – సరే, శ్రీమాన్ బాబూ మురారి కృష్ణజీ హిందూదేశపు శిరోరత్నమా – ఒప్పుకున్నాను. తృప్తయిందా? కొంచెం త్వరపడండి. ఇక్కడనే సాయంత్రం చేస్తే మన మాటే దేమిటి?

అదేమాదిరి – "అల్లరి చెయ్యొద్దండి" అని నేను నీమీద దిండు విసరివెయ్యడమూ, నీవు నామీద నీకోటు,

టోపీ, కమీజు (విప్పి) విసరివేయడం, అలానే నేను "హ్యాండ్సు అప్!" అనడం, నేను నీ (తెల్లగా అందంగా ఉండే) నీబుగ్గలపై కర్రతో చిత్తాకర్షకంగా ఒక దెబ్బ కొట్టడం, నీవు నామీాద కలబడి లోబర్చుకోని, నేలమీాద పడదోసి, గుండెలమీాద కూర్చొని "దుష్ట" అనడం, నేను క్రిందనుంచి గట్టిగానవ్వుతూ "దుష్టుని ప్రియతము" అనడం, నీవు "పద అనడం" నేను "పడిచేస్" అనడం.

ప్రియతమా, నే నలాగే స్వప్నం చూపించవు. అవెంత మంచిదినాలు!!

ఆఖరి జాబు నీకు నేను గయ కాంగ్రెసు సమయాన పంపాను. నీ వప్పుడు గయ కాంగ్రెసు స్వాగత కార్యకారిణీ సంఘ మహామంత్రి అనుకోషించే స్వయం సేవకుల చేస్తుంటివి. తరువాత యేమయిందో (నీ వెట్లుంటివో, యెచ్చటుంటివో) నాకు తెలియులేదు. నీవు గత వర్షం కాన్పూరు రాష్ట్రీయ సంఘ మంత్రిగా వుంటివని యెవరో చెప్పారు. దేవుడు తలిస్తే నీవు కాన్పూరు వృత్తిమనాయకుడవే. కాని దీనులకు మమ్ము (కాంగ్రెస్ కూడ బీదలకు సహాయం చేస్తుంది) మరవవద్దు. నీకు జ్ఞాపకముందా? నేను నీ ప్రియుడను.

కొంచెము వేగిరపడుతున్న, చాలా పెద్ద కథ నీ యెదుట వుంచవలసివుంది. ప్రస్తుతం కలకత్తాలో గొప్ప చిక్కులో పడివున్నా. నీవు యెల్లప్పుడూ నా కష్టాలు తీర్చేవాడవే. నీ యెరుకన నా కేకష్టం కలుగజాలదు.

వు నా జీవన కవచానివి. నీ నేత్రాలయెదుట నా హృదయ మెప్పుడూ దూరదృష్టిగల దౌతుంది. నీకు తెలి యదా? నా మైత్రికి పవిత్రత కల్గించలేవా? ఇంత రకూ అవసరం పడినప్పుడు ప్రపంచంలో యెవరివల్ల గాదు కేవలం నీ ప్రియసలహా పొందుతున్నాను. నీ సలహాలు దేవతల ఆశీర్వాదాలవలె శుభాలు కల్గిస్తు న్నాయి. ఈసారికూడా నీవే సలహా యియ్యి, నీవే రక్షించు. ప్రియతమ — "నాదూ నొక అల్లలలాడూ..."

చిన్నకథ – ఓరోజు తెల్లవాళ్ళతో ఫుట్ బాల్ ఆడి వస్తూంటే దారిలో ఓ అందచందాల యువతిదర్శన మయింది. ఆమె బంగారు కుప్పలా కాంతివంతంగా రత్నాలమాలవలె మిలమిలలాడుతూ వుంది. నీ నేత్రాల లాంటి నేత్రాలు, నీ ముఖంలాంటి సుందరముఖం, నీచిరు నవ్వులాంటి మధుర మందహాసం, నీ ముక్కులాంటి ముక్కు, నీ పెదవుల్లాంటి పెదవులు (నీవుగనక చూస్తే చెల్లీ, చెల్లీ, అంటూ వెంటబడుతావు). నీ హృదయం తోడుగా ఒట్టేట్టుకుంటున్నా."

ఆమె మెరుపుతీగవలె నా కండ్లెదుర మిరుమిట్లు గొలిపింది. నేను నిజం చెప్తున్నా గాభరాపడ్డాను.

ఓ స్నేహితు డడిగాడు–"ఎప్పటిదీ పరిచయమండీ?" అని.

"కనబడని వీరుడవోయ్."

"అరే సోదరా ఈమెగుణాలె యిలాంటివి. భగ వంతుడు నన్ను నీ వంటి "ప్లేయరు"గా సృష్టించలా?

లేకపోతే ఇలాంటి వస్తువు: "య" నా కదృష్టము లేదు...

విచారించగా ఆమె స్థానిక గరల్స్ కాలేజిలో ఓ విద్యార్థిని అని నా స్నేహితులవల్ల తెలిసింది. ఏమైనాకాని, ఆ యువతి దర్శనంవల్ల నాకు సుఖం దొరికింది. ఓసారి చూట్టంతోనే ఆమె నా దృష్టుల్లో (బహుశ నేను పొరబడుతూ వుండొచ్చు) ఈ లోకంలో యింత త్వరలో దొరకని వస్తువుగా కనబడింది (కాని ఖచ్చితంగా ఆ సంగతి నాకు రెండు మూడు నెలల తర్వాత తెలిసింది. ఆ రోజు ఆ సంగతి అచ్చటే వుండిపోయింది.

గరల్స్ కాలేజి హాస్పటల్ దారిన మేము రోజు రెండుసార్లు పోతూ వస్తూ వుంటాము. ఇంతకుముందు నేనెప్పుడూ హాస్టలుభవనంవేపు కన్నెత్తయినా చూచింది లేదు. కాని ఆ విషయం జరిగిన తర్వాత వచ్చేపొయేటప్పుడు హాస్టలువద్ద కండ్లు దేనో వెతుకసాగినై, నిరుద్దేశ్యరూపంగా. కాని, అధిక ప్రేమతో హృదయపూర్వకంగా తుదకు వారాలతర్వాత నాకోరిక ఫలించింది. నేను బైసికల్ మీాద (గుంపు తొలగడానికి అనారామంగా ఘంట వాయిస్తూ) గరల్స్ కాలేజీ హాస్టలు ద్వారం దాటిపోతుండగా ఆ జట్టు కనబడింది. వారు కూడా ఎక్కడికో పోతున్నారు. టాక్సీలు నిలబడివున్న

నన్ను చూంచి వారికండ్లు విశాలమయినాయి. పెదవులు చిరునవ్వు నవ్వాయి. వారిని చూచి నాకండ్లు విస్మిలన్నయి. హృదయ మెలాగైందో యే మెరుగుదును. వారి అందమైన ముఖాలు, సరస నేత్రాలు "బా

న్నారా?" అని అడిగినాయి. నా రోమరోమాలు "ధన్యవాదా" లన్నాయి. నే నో నిమిషం సైకిలు దిగి వారివైపు వెళ్ళా.

"నేను (ఆరోజున్నాటి)తమకు జ్ఞాపక మున్నానా...?"

"నేను ఏడెన్‌గార్డెన్స్‌కు పోతున్నా" ఆశ్చర్యయుక్తంగా కనుబొమలు త్రిప్పుతూ "మేము తరచుగా ప్రతిదినమూ అక్కడికి వెళ్ళుతుంటాం" అని ఆమె అన్నది.

ఇంతకంటె అధికంగా మాట్లాడ్డానికి ఆరోజు మాకు ధైర్యమూ లేదు; వ్యవధీ లేదు. వారు టాక్సీలపై వారిదారిన వెళ్ళారు. నేను ఆకాశంలో సంచరిస్తూ నాదారిన వెళ్ళాను.

ఆరోజు ఏడెన్‌గార్డెన్స్‌లో నలువేపులా చంద్ర కిరణాలు నాట్యం చేస్తూవున్నాయి. అనంతమైన ఎలక్ట్రిక్ దీపాలవరుస ఆమె మెడలోని రత్నాలహారాలుగా కనబడ్తూ వచ్చాయి. నేను సాయంకాలం అయిందనగానే అక్కడికి చేరా, అక్కడే ఎవర్నో వెతకడానికి. కాని, సాయంకాలం దీపాలు వెలిగించినా కూడా "ఎవరో" అగుపడలేదు. నేను అచలహృదయంతో అటూ ఇటూ తిరుగుతూ గొనగసాగా-

"ఓయి ప్రియతమ నీ వొకమారు నాదు
ద్వారమందున వచ్చియు నిలిచితేని
హృదయమందున రగులకుండు
స్థిమితమొందును హృదయము చల్లబడును.

వారు యీదారి రాకుండునంతవరకు
నాకు క్షేమమె గలుగుచు నుండుగాని
వారు యీదారి వచ్చుట కలిగెనేని
నేను వారిని కలియక నుండజాల."

ఆ [illegible] బిగ్గరగా" అంటూ అమె వచ్చింది.

"నేడు మీ రొకరే వచ్చారా?"

"అందరూ వున్నారు"

"ఎక్కడ?"

"వారి వారి మనస్సు లున్నచోట"

"అయితే మీమనస్సు...?" (సంకోచంతో "మీ మన స్సిక్కడనా" అని అనలేకపోయా? కాని కండ్లేమో చెప్పేసినై. ఆమె హృదయమేమో వినేసింది.)

"మీరంతా అందరితో కలసి మెలసి మాట్లాడ గలరా" అని నే నడిగా. "లేదంటె, మే మందరితో కలియ డానికి, మాట్లాడడానికి వీలులేదు. కనుకే మిసెస్ కిడ్ సదా మావెంట వుంటుంటుందని ఆమె అన్నది.

"ఇవ్వాళకూడా వుందా?"

ఆ, ఆవైపు తన ఆంగ్లేయమిత్రునితో మాట్లాడు తుంది. నేను మిమ్మల్ని చూచి యీవైపొచ్చేశా. నేను నాతోడివాళ్ళని మోసగించేశా. మంచిది. వెళ్ళు తున్నా.

"ఎందుకు?"

"హ హ హ. మనము పాత పరిచితులవలె ఈ "యెందు" కనే దేమిటి - మాట కడ్డంవచ్చి నేనిలా అన్నా. "మనం పాత పరిచితులం కాకపోతే మీరు మిసెస్ కిడ్‌తో యెలా చెప్తారు."

మందహాసంచేసి ఆమెదృష్టులు క్రిందికి బరపింది. బహుశా రెండునిమిషాలు మేమిరువురం యెదు రెదురుగా నిలబడి మౌనంగా ఒకరొకరిన్ని వొకరం చూచు కొంటూవున్నాం. కాని మనస్సులు మాట్లాడుకొంటూ వున్నై. తర్వాత ఆమె యిలా అన్నది.

"మీపేర ఒకవుత్తరం వుంది"

"మీవద్దా"

"ఔనండీ, పొరపాటున పంపేవారు నావద్దకే పంపారు. ఇదిగో తీసికోండి" ఒక కవరు నాచేతి కిచ్చి నే నడ్డగించినా నిలువకుండా వెళ్ళిపోయింది. కవరు సుగంధముతో నింపిఉన్నట్లుంది. పైవ్రాత తప్పక స్త్రీలదే కాని, శుభ్రంగా అందంగా వుంది. దానిమీద ఇంతే వ్రాసివుంది.

"మిష్టర్ మురారీకృష్ణ"

లోపల అందమైన గులాబీరంగు లెటరుపేపరుపై మూడు పంక్తులు.

"ఆదివారం సాయంత్రం గరల్స్‌కాలేజీ హాస్టలు గేటువద్ద ఒకసారి తప్పక నన్ను కలుసుకోండి. నామీద వొట్టు తప్పక. న—"

ప్రియతమా, జాబు పెద్దదౌతుందని నాకు తెలుసు. కాని చిన్నదైనప్పుడుకూడా నీ విష్టపడవు. అంచేతే విస్తృత వివరంగా వ్రాస్తున్నా. ఇంతవరకూ ఎప్పుడూ నాకు ఆ "శ్రీమతి" పేరు తెలుసుకునే అవకాశం దొరకలేదు. "న" – నేను మనస్సులో తలచా యీ "న" తో యే పేరుడొంచ్చు ? నళినీ ! కాని ఆమె బంగాళీగా కనబడదు. ఏమైనాగాని ఆదివారం ఆమెను కలసినప్పుడు ఈ "న–" రహస్యార్థ మేమిటో అడుగుతా.

ఆరోజు సోమవారం, మరి ఆదివారం సాయంత్రం రాడానికి పూర్తిగా మధ్య అయిదున్నరరోజులు. కాని ఏండ్లు గడిచినాగూడా ఆదివారం రానట్లుగా నాకు తోచింది. చాలాదినాలనుంచి ఆలోచిస్తున్నా. ఆదివారం రాగానే ఆరోజు నా మన స్సెందుకో సంతోషతరంగాల్లో నాట్యమాడుతూ వచ్చింది. సమాగమమైతే సాయంత్రం అయిదున్నర, ఆరుఘంటలకు. కాని, పన్రెండు ఘంటల నుంచే ముస్తాబుచేసుకోడానికి ఆరంభించా. గుడ్డలపెట్టెను పరీక్షించా. ఒక్కటొక్కటీ ధరించి ఏది అందంగా వుంటుందోనని అద్దంయెదుర నిలిచి చూచా. బూటును (నాచేతుల్తో) రెండేసిమార్లు పాలీషుచేశా. ఆమెదగ్గరకు వెళ్ళుట కానాడు నేను చేసిన ముస్తాబు మరి నేనెప్పుడూ యింకోవిషయంలో చేయలేదు. చివరి కా సమయం కూడా వచ్చింది.

నేను సైకిల్ ఘంటను టన్ టన్ మని వాయిస్తూ గరల్స్ కాలేజీ హాస్టలువైపు పోతుండగా నాటీమ్ములో

ఆడిన (కాలేజీ బి. ఏ. విద్యార్థి) యాకూబ్ అహమద్ కనబడ్డాడు. అతడు గరల్స్‌కాలేజీ హాస్టల్ వేపునుంచి నావైపు వస్తూవున్నాడు.

"వహావ్వా వహావా! బలే ముస్తాబే. ఎవరి ప్రేమ కోటను ఛేదించడానికి పోతున్నావ్."

"అదృష్టం. తమ రెక్కడనుంచి ఎచటికి యీ పోక?"

"ఊరకే తిరుగుతున్నా." అతని సైకిలు ముందుకు సాగింది.

"నమస్కారం. మళ్ళీయెప్పుడు" అని నేనన్నా.

అతడన్నాడు— "నమస్కారములు కోరినప్పుడు."

గరల్స్‌కాలేజి హాస్టల్ గేట్ వద్దకు చేరగానే పార్శ్వభాగంలో గులాబీరంగుచీర ధరించి గేటువద్గర తోటలో నిలబడి ఏదో పుస్తకం చదువుతూ ఆమె కనబడింది. నేను ఘంట మ్రోగించా. ఆమె చూచింది.

"నేను లోపలికి రావచ్చా?" అని నేను గేటు కీపరుని లెక్కచేయకుండా ఆమెనే అడగా. ఆమె తల ఆడించి నోటితో "లేదు" అంది. కండ్లు తిప్పడంతో "రావచ్చు" అని సంజ్ఞ చేసింది.

నేను లోపలి కెళ్ళి ఆమె కెదురుగా నిలబడ్డాను.

నేను చిరునవ్వుతో ఇలా అన్నా —"మొదటి ప్రశ్న నాది. మీ శుభనామం ఏమి? నన్ను జ్ఞాపకం చేసుకుంటుంటే ఆ "న"గా రెవరు? "న" అర్థ మేమిటి? నేను తెలుసుకోవాలన్న కుతూహలంగా వున్నా.

ఆమె చెప్పింది– "న" నా స్నేహితురాలు. ఇది ఆమె పేరుకు మొదటి అక్షరం .ఆనాటి ఆటప్పుడు ఆమె కూడా వుండింది. ఆమె మిమ్మల్ని కలుసుకోవా ల్నం టుంది. ఆమె, మీపై ...

"నడవండి, నే నామెను కలుసుకొని ధన్యుడ నౌతాను" అని నేనన్నా.

ఆమె అన్నది– "కాని మా వార్డన్ మిమ్ముల చూడ్డానికి ఆమెకు వుత్తరు విచ్చలే. మేము బాలికలం. మీరు యెరిగిందేగదా. మే మందరి (ప. ఫ. బ. భ.) తో కలవలేం."

నేను చిరునవ్వుతో ఆమె నడిగా "అయితే వార్డన్ తమరు నాతో కల్సుకోటాని కెలా ఆజ్ఞయిచ్చింది?"

"నేను అబద్ధం చెప్పి ఆమె అనుజ్ఞపొందా. మీరు నా పాతపరిచయులని చెప్పా."

"మరి నే నిప్పు డేంచేయాలె."

"నాతో మాట్లాడాలె."

"ఎలా ?"

"నా స్నేహితురాల్ని గురించి. ఆమె మిమ్మల్ని కొన్ని ప్రశ్న లడుగమన్నది. మీ భార్యపేరేమో తెలుసు కోమ్మన్నది."

"అడగండి."

"భార్యపేరా ?" నేను ఆశ్చర్యంతో జవాబిచ్చా– "నా పెండ్లి కాలేదు."

ఆమె ముఖం నామాట విని కమలము:వలె వికసించింది. ఆమె కొంచెం ముందుకు నడచి నావద్దకు వచ్చి నా సైకిలుహ్యాండిలు పట్టుకుని నిలబడింది.

"నామీద ఒట్టు...?" ఆమె అడిగింది.

"నేను ఒట్టు పెట్టుకోను; కాని నేను అవివాహితుణ్ని."

"పెండ్లెందుకు చేసుకోలేదు?"

"క్షమించండి" ఆమె వ్యవహారాల్తో వికసించిన నాధైర్యం గట్టిగా ప్రశ్నించింది.

"మీా పెండ్లి...?"

ఆమె ముఖం ఎర్రబడింది. చెవు లెరుపెక్కాయి. ముక్కెర్రనైంది. అచ్చం గులాబీ పూరెక్కలతో తయారైన మూర్తిలా నా సైకిలుహ్యాండిల్ పట్టుకుని నిలబడి వున్నట్లు కనబడుతోంది.

"తమ ప్రశ్నాభిప్రాయం?" అని అడిగింది. ఆమె ముఖం నా ముఖానికి చాల సమీాపంగా వుంది.

"ఏ ప్రశ్నయొక్క అభిప్రాయం?" అని నేను కూడ పూని అడిగా. నా ముఖంకూడా (సరిగా జ్ఞాపకం లేదు, బహుశా)ఆమె ముఖంకంటె మరీ దగ్గరగా చేరింది. ఆమెశ్వాస నాకండ్లపై పడ్తూవుంది, నా శ్వాసలు ఆమె పెదవులతో వియ్యమొందుతున్నై.

"నేను జవాబివ్వను, అడుగుతున్నా" అందమైన కోపంతో ఆమె అన్నది వెంటనే. ఆమె ముక్కుకొన

నాముక్కుకొనతో తాకింది. శరీరంలో అగ్ని మెరుపు వలె పరుగెత్తినట్లయింది.

నేను సాధువునుగాను, ఫకీరునుగాను, మహాత్ముని గాను, త్యాగినీకాను, ఋషినీగాను, మునినీగాను, సౌందర్యంతో పూర్ణంగా నిండివుండే పాత్రను చూచి నా మనస్సు సుడివడింది; మనస్సులో కొచ్చింది.

—చూస్తావేం ? "గుడ్లక్, కానీ" మరేం-అదే అయింది.

నా ముక్కుతో ఆమె (ఏవిధంగానో ఏంచేస్పేది..?) అందమయిన ముక్కును నా పెదవులతో ఆమె దొండ పండులాంటి ఎర్రనిపెదవులను మెల్లగా తాటిస్తూ నేనన్నా - "నేనుకూడా జవాబివ్వను, అనుగుతున్నా."

"వహ్వారే సాహసం, వహ్వారే ధైర్యం" అంటూ పసిబిడ్డ నామెడ కౌగిలించుకొంది. ముద్దులతో నా ముఖం నింపేసింది. నేను వివశుణ్ణయి నాభుజాల్లోకి అదుముకున్నా.

నా సైకిలు ధణధణమని భయంకరశబ్దంతో సాపుగా నేలమీద పడిపోయింది. నా కప్పుడు చైతన్యం కలిగించింది. నే నాలోచించా — "నా కేమైనా పిచ్చి పట్టిందా ?" బైసికిలు ఆమెకుకూడా చైతన్యం కలిగించింది. ఆమె న వ్వికిచి దూరంగా నిలిచి తల, మెడమీదుండే గుడ్డను సవరించుకోసాగింది.

"ఏమైందండీ" అని గేటుకీపరు కేకేశాడు. నేనన్నా...... "కొంచెం అగ్గిపెట్టి తే, ల్యాంపు వెలిగించాలె, సాయంత్రమైంది."

నౌకరు అగ్గిపెట్టిచ్చి వెళ్ళిపోయాడు. అప్పటికి మేము జాగ్రత్తపడ్డాము. ఆమె అన్నది......

"నా పెండ్లి అయిపోయింది."

"అయితే నా పెండ్లికూడ అయిపోయింది." అని నేనన్నా.

పైటలోపల్నుంచి ఒక కవరుతీస్తూ ఇలా అన్నది-

"ఇందులో నా సఖి "న" పేరు పూర్తి అడ్రసు వుంది."

నే నన్నా - "మీ స్నేహితురాలి రూపం, హృదయం తమకంటె యేమాత్రమైన భిన్నమాయెనా ఆమె పూర్తిగా నిరాశ పొందాల్సొస్తుంది."

"కవరు యింటివద్ద విప్పాలి. మీ అడ్రసు కలకత్తా కాలేజీ హాస్టలుగదా?"

* * * *

ఇంటికిచేరి చూడగా కవరులోపలి కాగితంమీద- "నేను లక్నోలోని సుప్రసిద్ధ పురవాసి ఖాన్ బహదూర్ మహమ్మదు హుసేన్ కూతుర్ని. నాపేరు "న" లేక "నర్గిస్".

నా కాళ్ళక్రింద మట్టి ఎగిరిపోయింది. నే నిప్పుడిప్పుడే ఓ మహమ్మదీయ యువతిని ముద్దిడి వున్నానా? నేనా? ఎవరి రక్తనాళాల్లో పవిత్ర హిందూరక్తం ప్రవ

హిస్తోందో నేను ఒక విజాతీయయువతి చరణాలలో హృదయార్పణం చేశానా?

తండ్రే మంటాడు? ప్రయాగే మనుకొంటుంది? సంఘ మే మంటుంది? దేశ మేం చేస్తుంది? మరి, మా యిద్దరిపెం డ్లిలా జరుగుతుంది?

ప్రియతమా, పెండ్లికిపూర్వం మన మిరువురం తప్పక పరస్పర సలహాలు పొందాలని ప్రతిజ్ఞ చేసుకున్నాం. ఈ సమయంలో నీ వుండడం అత్యవసరం. వీలైతే రెండు మూడు దినాల్లో యిక్కడికి రా. నన్ను రక్షించు. నన్ను మంచిమార్గంలో వుంచు. ఈ సమయంలో నా కర్తవ్యం యేమి? నేను మహమ్మదీయయువతి సుందర నర్గీసును హృదయయేశ్వరిగా చేసుకోనున్నా. ఇప్పుడేం జేసేది. తండ్రికి సంగతెలా నచ్చచెప్పేది? దీని ప్రభావ మెలా ఆయనపై ప్రసరించునో?

నీవు రాజాలకపోతే వివరంగా జవాబు వ్రాయి ప్రతి విషయం అతివిస్తరంగా.

కలకత్తా వచ్చేటట్లయితే "మతం" విడువడానికి తయారై రావాలి. ఏమంటే నేను ముస్లింయువతిని ముద్దుపెట్టుకున్నా. మరి నీవు నన్ను ముద్దెట్టుకోవాలి.

నీ

అయోమయంలో పడిన

మురారి కృష్ణ

# 3

అడ్రెసు :

జనాబ్ అలీ హుసేన్ సాహెబ్,
(బార్ - ఎట్ - లా)
నెం.10002 ఝ,చౌకు,పాట్నా సిటీ

హజరత్, గంజ్ లక్నో.
10-1-26

నా రాజా,

ఈ వుత్తరం (నేను చదువుతూ వున్నది) మీరు వ్రాసిందేనా? మీ రింత కఠినులు, కోపిష్ఠులూ కాగలరా? ఈ విషయంలో నామనస్సుకు నమ్మకం కలుగడంలేదు. మీరు నాదేవత. మీరు న్యాయదూరులైతే నా ఊహాపరాలు నాశనమైపోతాయి. జ్ఞాపకం చేసుకోవాలి: దీర్ఘకాలపు శెలవులు ముగిసి పాట్నాకు వెళ్ళేముందు (తే 31-12-1925 రాత్రి పన్నెండు ఘంటలప్పుడు) నా మెడమీద చెయ్యివేసి మీ రిలా అన్నారు - "ప్రేమే దేవుడు. ప్రేమే స్వర్గం. ప్రేమే జీవితంలో అన్నిటికంటె వుత్తమమైంది, సుందరమైంది." ఈ విషయా లేమో 25 వ సంవత్సరంలో చెప్పబడినై. మరిప్పుడు 1926. కాని, తెలుసుకొనేవాళ్ళు ఈ 1925-26 లలో కేవలం కొన్నిదినాలే భేదం - అంటే పదికంటె ఎక్కువ వుండదంటారు. ప్రేమ, ప్రేమలోవుండే ఆనందమంతా మనవరకే పరిమితా? ఏం,మీ చెల్లెలు నర్గీసుకు హృదయం

లేదా! నేను మిమ్మల్ని, మీరు నన్ను ప్రేమించుకో గలం. దీనికోసం మనం మన తల్లిదండ్రుల్తో జగడమాడ గలంగూడాను. కాని యీపనే ఇతరులు చేయగూడదా? ఎంచేత ?

కొంచెం రెండడుగులు వెనుకకు తొలగి (నేటికి 4 సంవత్సరాలముందు మీనమున్నస్థితికిపోయి) నర్గిస పరిస్థితిపై ధ్యానముంచండి. మీరు విదేశంనుంచి బారిష్టరై వస్తు న్నారు మాయింట్లో యేదో పండుగ. అప్పుడు మీరూ మీకుటుంబమూ మా అతిథులుగా వున్నారు. కాని మీ రేం చేశారు? ఆదరంతో మీ కాతిథ్యమిచ్చే దాతల యింటే దొంగతనం చేశారు. అదైనా యెలాంటిది? హృదయాన్ని. (కోర్టుకెళ్ళి ఫిర్యాదు చేస్తుంటే మీ బారి ష్టరీ అంతా గంగలో కలిసుండేది.) చోరీయే కాదు, మీరైతే బలాత్కారంకూడా చేశారు. పెద్దలవల్ల మీరు చిక్కుబడ్డారు. నన్నుకూడ చిక్కుబడడానికి (సరే సరే ననమని) ప్రేరేపించారు. లక్నో అంతా తికమకలైంది. "ఈ కుర్రాడు క్రైస్తవుడైనా"డని అందరూ అనసాగారు. "అరరే! యీ కుర్రది బళ్ళోచదివి దొరసానైందోయ్" అని స్త్రీలు చెప్పుకోసాగారు.

ఆసమయంలో మీరిప్పుడు నర్గిస్‌కు వ్రాసినట్లే యెవడైనా మీకు వ్రాస్తే మీ కెలావుండేది? మీ రిలా వ్రాసివున్నారు.

"ఈ విషయం కేవలం నర్గిస మూర్ఖత, తెలివి తక్కువతనం అని తలుస్తా. ఆమె యీవిధంగా ప్రేమించ

డానికి హా కేమీ లేదు. నేను లక్నోలో వున్నప్పుడు ఈ విషయం నాకు చెప్పకుండా చాలా తప్పుచేశావు. ఆ సమయంలో నర్గిస్ కూడా వుంది. నే నామెను అసలే కలకత్తాకు పోనిచ్చి వుండేవాణ్ణి కాదు. బాలికలు చదవాల్సిన దానికంటే ఆమె చాలా యెక్కువగానే చదివేసింది. ఆమె నౌకరి, బారిష్టరీ, నాయకత్వం, యిలాంటివేమీ చేయాల్సిన అవసరం లేదు. ఏ కొంచెం స్వాతంత్ర్యమిచ్చినా యీ దేశపు స్త్రీలు తలపై యెక్కుతారని నాకు తెలుసు."

ఒహోహో! నేను మీ వుపదేశాలకోసం యాచించలేనా? మీరు మోసగాళ్ళయిన హిందూ పండితుల్ని మించారే! దీర్ఘకాలపు శెలవుల్లో నాలుగుదినాలపాటు యింటికి వచ్చినా, "ప్రాణాన్ని" యెలా దుఃఖపెడతాను. ఆమె "లవ్ అఫైర్స్"లో ఆమె యిష్టానికి విరుద్ధంగా జోక్యం కలుగజేసికోనని మాటయిచ్చా. మీకు 1926 లో తెల్సిన విషయాలు నాకు 1925 నవంబరు నెలనుంచే తెలుసు. నేను తెలుసుకోవాలనే యీ విషయాలు మీకు యెరుకపరచలే. నేను నానర్గిస్‌ను మీకంటె యెక్కువగా యెరుగుదును. ఆమె పట్టుబట్టిన విషయాన్నుంచి ప్రపంచం తలక్రిందులైగూడ తనవైపు పాకర్షించుకోలేదు. నర్గిస్ యొక్క యీ పనిని మీరు కేవలం తెలివితక్కువని తలుస్తారా? ఎందుకు తలచరు? యే కొంచెం స్వాతంత్ర్య మిచ్చినా యీ దేశపు స్త్రీలు తలపై కూచుంటారు. ఇది మీ రెరు

గుడుకు. ఎందుకు కొరుగరు? కాని, స్వామీ, సేవకురా లీ ప్రశ్న అడుగవచ్చా- నర్గీసువి దేంవి తెలివితక్కువ పను లంటున్నారో. ఆ పనుల్లోనే "అసగరీ" మీకు ప్రియు రాలెట్లు కాగలిగింది ? ఇప్పుడు నర్గీసు యేమి చేయ బోతున్నదో, దాన్నే అప్పుడు నేనుకూడ చేసింది. మరచి పొయ్యారు.

ఈ దేశంలోని ఆడవాళ్ళపై తమ రిమార్కులోకే రీతి వుంది మీ భార్య అవినయాన్ని మన్నింతురుగాక. పురుషుల చేతుల్లో స్త్రీల హృదయాలు, వారి వూహాలు, వారి స్వర్గనరకాలు, వారి ప్రేమ స్వాతంత్ర్యాలు గుత్త కొనబడుతున్నాయా ? పురుషు డెవణ్ని చెపితే స్త్రీ వాణ్నే ప్రేమించాలి, వాడి అధీనం కావాలె, వాణ్ని తనవాణ్ణిగా చేసుకోవాలె. స్త్రీలు కులటలు, మూర్ఖులు, అపరిశుభ్ర తకు నిలయాలు, బానిసలు, ఆచార రహితలు, అజ్ఞానలు- అంటే ప్రపంచంలో అందరికంటె చెడ్డవాళ్ళంటే స్త్రీలే. మరి బానిసల రక్షకులు మీ పురుషులు; పరిశుభ్రతకు, తెలివితేటలకు, శౌర్యానికి, శిష్టవ్యవహారాలకు ప్రసిద్ధు లైన మీరు స్త్రీల నెందుకు నాశనం చెయ్యరు. ఇదే చేయండి, తప్పక చేయండి. చాల పుణ్యముంటుంది. ప్రపంచం (అమెరికా, జపాను, ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, రష్యా, టర్కి-) స్త్రీలకు స్వాతంత్ర్య మిస్తూంది. అయ్యగారి దేశపు పురుషులు ప్రపంచానికి విరుద్ధంగా విప్లవం లేవదీయాలి. స్త్రీలను జైళ్ళలో వుంచాలి. తిన నివ్వగూడదు. చూడనివ్వగూడదు. విననివ్వగూడదు.

ప్రేమించ నివ్వగూడదు. చదువడ మనలే లేకుండ చేయాలి. తను దేశాన్ని స్వర్గధామమని, పురుషుల్ని భగవంతుడని చెప్పేట్లయితే తప్పుగాదు. దేనిపండు తిన డానికి ఆజ్ఞలేదో అట్టి "ఫర్బిడన్ ట్రీ" విద్య యని మీ రంతా మా స్త్రీలకు బోధించండి. స్త్రీలుకూడ "ఆదం", "ఈవ్" మాదిరిగా జ్ఞానవృక్షం పండు తిని సావధానులై మేల్కొంటారు. కనుక మీ (దేవుళ్ళ) మాట విని స్త్రీని మీ సోషల్ పారడైజ్ (సామాజిక స్వర్గం) నుంచి వెళ్ళ గొట్టండి. కాని జ్ఞాపక ముంచుకోండి– వారిలో మొదటి నంబరు మీ అసగరీది వుండును. మీ రిలా వ్రాసి వున్నారు :

"నేను మహమ్మదీయుణ్ణి. భగవంతుణ్ని పూజించే ఇస్లామును పూజించే మతాన్ని పూజించేవాణ్ని. నేను నా చెల్లెలు అన్యమతస్థుని వివాహం చేసుకోడం మాత్రం సహించలేను. నర్గిస్‌కు విషమిచ్చి చంపేస్తా. నేను గొంతుపిసుక్కొని చస్తా. కాని అప్రతిష్టనుండి రక్షించు కోటానికి ప్రయత్నిస్తా – రక్షించుకుంటా......"

నాస్వామీ, ఇలాంటి మాటలేమిటి? ఏనుగులకు నమలడానికీ,చూపుడుకూ వేరేవేరే పండ్లున్నవని విన్నా. కాని పురుషుల హృదయాలుకూడ రెండువిధాలుగా వుంటవని నేడు తెలుసుకొన్నా. చెప్పేదాని కొకటి, మోసపుచ్చేదాని కొకటి. మీరు నాయెదుట ప్రేమ పూజారులౌతున్నారు. ఇతరులయెదుట ఇస్లాంభక్తులు, మతపూజారులు ఔతున్నారు. ప్రియా, తప్పుగా తలచ

వద్దు. ఇది ప్రపంచాన్ని మోసగించటంకాదా? మిమ్ములను మీరు మోసగించుకోటంకాదా ? అయ్యో, అయ్యో, మీ రీవుత్తరాన్ని యేదేని నిషాలోవుండి వ్రాయలేదు గదా ? నర్గిస్‌కు విషంపెట్టి చంపేస్తారా. ఎందుకు ?

మనం ప్రపంచంలో ఏది అన్నిటికంటె దుర్లభ పదార్థమని తలుస్తున్నామో ఆ ప్రేమకొరకేనా ? దేన్ని పొంది మనుష్యుడు మానవత్వాన్ని పొందుతున్నాడో ఆ ప్రేమకొరకేనా? దేనిపేరు స్మరిస్తూ ప్రపచం తనయాత్రను సాగిస్తుందో ఆప్రేమకొరకేనా?ఏది భగవంతుడుగా, మతంగా, పవిత్రకురాలుగా యెంచబడుతుందో ఆప్రేమ కొరకేనా ? దేనికీర్తిని గానంచేస్తూ హాఫిజ్, సాదీ, ఖయ్యాం మీర్, గాలిబ్, జఫర్ వీళ్ళంతా దేవతలవలె ప్రసిద్ధిగాంచారో ఆప్రేమకొరకే!

ప్రేమకోసం హత్యా? నారాజా, మీరుపిచ్చివారై పోలేదుగదా ?

మీరే ఆలోచించండి : మీరు నాతలపై చెయ్యి వుంచి, ప్రేమ – చట్టాలకు, ధర్మానికి, మతానికి, హిందువుకు, ముసల్మానుకు, క్రైస్తవునికి వీరందరికి భయపడుతుందని చెప్పగలరా? ప్రేమ హృదయాన్ని చూస్తుంది : కాని మతాన్ని, చట్టాన్ని, హిందువుని, మహమ్మదీయుణ్ని చూడదు. నాదేవా, మీరు హిందువులైనా నా దేవతే, నా భర్తలే, నా యజమానులే ఔతారు: రేపు మీరు క్రైస్తవులయినా నేను మీదాన్నిగానే వుంటా. మీరు నాదృష్టిలో ఒకే రకంగానే వుంటారు. మతం

ఈ ప్రపంచములోని వస్తువు. ప్రేమ ఆప్రపంచంలోనిది. మతం నిజమైనమతమైతే ప్రేమమార్గానికి కంటకంకాదు, పుష్పమౌతుంది.

ప్రియుడా! నేను మీ ఆయుధాలతోనే మిమ్ముల నోడిస్తా. మీవల్ల విన్నమాటలే మీకు ప్రతిద్వంద్విగా మీయెదుట వుంచుతా. ఇది మీరు చెప్పిందే-"మొదట హిందూ ముస్లిం ఈసాయి యహూదీ అని యెవ్వరు లేరు. అందరూ మనుష్యులే, అందరూ దేవుని ప్రియమయిన కుమాళ్లే. మరి, అందరూ కలిసి యిప్పుడు మరల మనుష్యులే యెందుకు కాకూడదు? హిందూ, ముస్లిం, ఈసాయీ, యహూదీ అనుపేర్లతో మనుష్యుల్లో ద్వేషాలు రగిల్చేవారిని చూచి దేవుడు సంతోషిస్తాడా? ఇది దయాళువయిన దేవునికి విరుద్ధంగా విప్లవం కలిగించడంకాదా?"

ఇప్పుడే - ఇప్పుడే నర్గిస్ జాబు వచ్చింది. ఊ; చూడతగింది. మీరుచూస్తే మీ పాదాలవొట్టు - కంట తడిపెడతారు. నాప్రియమైన ఆ కాఘిరు పై ప్రాణాలువిడుస్తుంది. కవరుపై కన్నీళ్ళు, లెటరుపేపరుమీద కన్నీళ్ళు, ప్రతియొక్క పంక్తిపై కన్నీళ్ళు. జాబుతోకూడ ఆమె ముసల్మాన్లు వ్రాసిన హిందీ పుస్తకాలుకూడ పంపింది. రహీందొకటి, రసఖానుదొకటి, మహమ్మద్‌జాయసీదొకటి, నజీరుదొకటి, కబీరుదొకటి. వీరు ముస్లిములయ్యీ సత్యాన్ని పూజించేవారని వ్రాసింది. హిందూ ధర్మంలోని మంచికి ముగ్ధులయ్యారు. మరి నేను హిందు

వును ప్రేమిస్తే తప్పా అనికూడ వ్రాసింది. ఆమె జాబు లోని ఒకభాగం:

"...స్త్రీల హృదయం నేడు హిందువుకు, రేపు ముసల్మానులకు యిచ్చివేసే వస్తువు కాదు. నిజమైన స్త్రీ తనస్వామిని, తనయజమానిని, దేవుణ్ని ఒకసారే ఎన్నుకుంటుంది - వేయిసార్లు కాదు. కనుకే స్త్రీలు పురుషులకంటె యెక్కువ - తల్లులు. ప్రేమిస్తే యెవ డైనా కోప్పడితే కోప్పడనీ. ఇదే దోషమయితే ఇలాంటి దోషులు చాలమంది వున్నారు. ఇప్పుడు ప్రపంచంలోని యేసత్తాకూడా మమ్మల్నిరువుర్ని వేరు పరచలేదు. నేను ఆయనదాన్ని, ఆయన నావాడు.

అన్నగారు కోప్పడతారని, నాయన తుపాకితో ప్రేల్చెయ్యడానికి సిద్ధపడతాడని నీవు వ్రాసివున్నావు. మంచిది. ఇల్లేకాని, నే నిప్పుడు కలకత్తానుంచి ఇంటికే రాను. నీవు విడిచిపెట్టినా, అన్న విడిచిపెట్టినా, నాయన తరిమివేసినా, అమ్మకూడ (యేది అసంభవమో) నన్ను మరచిపోయినా - నాకుకూడ దేవుడున్నాడు. అడుక్కు తిన్నా ఆయనతోకూడా నే,సింహాసన మెక్కినా ఆయనతో కూడానే అని నేను నిశ్చయించుకుని వున్నా... ఆయనతో కూడా దుఃఖ మనుభవించడంలోకూడా ఆనందముందని నీ వెరిగుందువు.

"ప్రియునితోడను పారతో గడ్డిదోక
మార్గమంతయు గొడుగుల నీడలోలుక
విరిగిన మంచముతో పడినట్టి యింటిలో

చిరిగిన పరదాల ప్రియుతోడ సంగమము
ఆశ్వాస మొనరించు సుఖముల బొందించు."

"రహీము"వి యీపంక్తులు. వీటిని ఇరవైనాలుగు గంటలలో దేవు న్నెదుట వుంచుకొని వేయిసార్లు మననం చేస్తూ ప్రార్థిస్తూంటా.

"నాకు కృష్ణవరు సంబంధము కలిగెనేని
వారి బూజించే దేవత నగుదు బ్రీతి."

నే నాయన్ని గుర్తించినప్పటినుంచి నేటిదాక విడువకుండా భగవంతుణ్ని, మతాన్ని, హృదయాన్ని, ఆయ న్నిచ్చివేయమని వేడుకుంటున్నా. వేయి కోహినూ ర్లంత ఆ ఒక కోహినూరు నాకు యిప్పుడు దొరికింది.

"వారి బడయను వరమును గోరుకతన
దేవు నన్నియు గోరిన యట్టులయ్యె
దీని బొందిన పిదపను అన్యమైన
వరము గోరంగ చేతులు యెత్త రావు."

నే నాయనదాన్ని, వేయిసార్లు. కాదు, వేల వేలమార్లయినా ఆయనదాన్నే."

చూచారా? ఇది నా కల్పన కాదు. మీ సోదరి నర్గిస్ జాబు. ప్రాపంచిక కష్టాలకు భయపడే ప్రేమ కాదు, ఆమె హృదయంలో వుండేది. నీ వే పదార్థంతో తయారుచేయబడున్నావో ఆమె హృదయ మస్తిష్కాలు కూడ అట్లే చేయబడున్నాయి. మరి ఆమె కన్న తక్కువ హాని యెలా కాగలదు ?

మరి దారికి రా, "న్యాప్రియా" మనం కొంచెం ధైర్యంతో పనిచేస్తాం. ఒకసారి హృదయాన్ని ఘట్టి చేసుకుని ప్రపంచంయెదుట ఒక ప్లాను ఇలా వేస్తాం - "మనకు అన్నిటికంటె గొప్పమతం ప్రేమ అనీ, ప్రేమను మించి మరిదేన్ని (దేవుణ్నికూడ) ఒప్పుకోమని" ప్రేమ ప్రపంచానికి ఆత్మ. అదియే దేవుని ప్రకాశం కాదు, కాని హఠాత్తుగా ఆయన కండ్లయెదుర ప్రకాశించిన మూసా హృదయంలోని ప్రేమ. ప్రేమ మూసాను హజరత్ మూసాగా చేసింది. ప్రేమలేకుండా దేవుడులేడు. కేవలం చెత్తే వుంటుంది. కనుకే ప్రేమే దేవుడని వేలకు వేలు చెప్పాచున్నారు (నేనూ చెప్పుతున్నా). ప్రపంచపు కపటం, ద్వేషం, శతృత్వం, అమిత్రత, కోపం వీటిని దూరంగా వుంచడానికి దేవునిమాటున ప్రేమే తన్ను పూజింప జేసుకుంటుంది. మరి మనం జాతి, మతం, రంగు, ఆచార విభేదాలలో ఎందుకు తగుల్కోవాలి? సూటిగా ప్రేమ - దేవుళ్ళకు దేవుడు-వద్దకే యెందుకు చేరకూడదు? ప్రేమను స్మరిస్తూ క్రీస్తు సంతోషంగా నవ్వుతూ "క్రాస్"పైన ఎక్కాడు. ప్రేమపేరటే హజరత్ మహమ్మదు ఇస్లాం జెండాను శిఖరాని కెత్తాడు. నేను (యూ-ఐ-మైసెల్ఫ్) గ్రహించినంతవరకు ప్రపంచంలోని గొప్పవాళ్ళంతా ప్రేమ, కేవలం ప్రేమసూక్తులనే గొప్పగా ప్రతిధ్వనింప జేస్తూండడం విన్నాను, విని కనిఉన్నాను. బృందావనంలో కృష్ణుడు ప్రేమసువార్తతో వచ్చాడు. కపిలవస్తులోని గౌతముడున్నూ ప్రేమసందేశంతోనే వచ్చాడు. (దీన్ని మీరు

స్వయంగా అనేకమార్లు చెప్పియున్నారు). నేటి (కపటం, ద్వేషం, బందిపోటు, దోపిడి) కాలంలోగూడ మానవ నామంతో "పశువుల" హృదయంలాంటి హృదయం ప్రేమనామంపై ప్రాణా లర్పించినట్టెన్ని, అర్పించుతూ వున్నట్టెన్ని వార్లనే గొప్పవాళ్ళని వొప్పుకుంటూంది. కారల్ మార్క్సు, టాల్ స్టాయి, లెనిన్ – షేక్స్పియర్, సాదీ, తులసి – కమాల్, అబ్దుల్ కరీమ్, జగ్లూల్ (జ్ఞాపకముందా? ఎవరిపేరుమీద బాకష్టరీ విశిచెయ్యడానికి మీరు సిద్ధపడ్డారో?), గాంధి నేను ప్రపంచంలోని పైగంబర్లను, అవతారాలను, అందర్ని అందరికంటె వుత్తమమనుష్యులుగా తలుస్తా. మూసా గాని లేక క్రీస్తు; మహమ్మదు గాని లేక కృష్ణుడు, గౌతముడు గాని లేక మాజినీ అందరూ మనుష్యులే. కాని వాస్తవమైన మానవుడు కావటం చాల కష్టం.

మరి నా ప్రభూ రండి: మన మిలా ప్రకటించాలె– "మొదట మనం మనుష్యులం. తర్వాత హిందువుగాని, ముసల్మానుగాని లేదా మరెవ్వరైనాగాని అయినాం" నేటి ప్రపంచం మతంతో, ఆచారాలతో, జాతులతో అనవసరమైననిబంధనలతో, రంగు భేదాలతో, హిందుముసల్మాను భేదాలతో గాభరా జెందుతూంది. త్వరలోనే మానవుల విముక్తికై మంచిమార్గాన్ని వెతకి కనుగొనే చింతలో మానవు లున్నారు. కళ్ళు వుండీకూడ గ్రుడ్డివాడు కావడం మంచిదికాదు. రాండి, మనం "యూనివర్సల్ బ్రదర్ హుడ్" ను వ్యాపింప జేసేవారికి

సహాయపడదాం. దీనివల్ల దేవుడు (ఆయన వుంటే) యెక్కువ సంతోషపడ్తాడు.

నా ప్రియమైన నర్గీసుకు పూత ఇవ్వండి. ఆమెను ప్రపంచపు బెదరింపులు, మానావమానాలు తిరస్కారాలనుంచి రక్షించండి. ఆమెహృదయంలో దేవుని కాంతివలె ప్రేమ ప్రకాశిస్తూవుంటే దాన్ని ప్రకాశించనీయండి. ఇలాంటి పవిత్రప్రేమవల్ల ప్రపంచజ్ఞానం పొందనీయండి.

ఇప్పుడు నాతో యెక్కువగా వాదించవద్దు. నేను లండనువెళ్ళి బారిష్టర్ ప్యాస్ కాలా. ఈ విద్యలో (వాదించడంలో) మీకు మీరే సాటిగా వున్నారు. కాని "హృదయం" ప్రశ్నించేటప్పుడు వాదవివాదాలు చేయడం యెంతవరకూ సబబో మీకు తెలుసు. ఇందువల్లే చెప్తున్నాను.

మరోమాటమాత్రం వ్రాసి జాబు పూర్తి చేస్తున్నా. మిమ్మల విడిచి నే నిప్పుడే ఒంటరిగా ఇక్కడ (లక్నోలో) వుండడం నా కిష్టంలేదు. పాట్నాలో మీ బారిష్టరుపని జరుగనీ జరుగకపోనీ, నేను నా హృదయాధీశ్వరుణ్ని బారిష్టరీకోసం విడిచిపెట్టలేను. తిన్నగా నన్ను తీసుకుపోకపోతిరా ఓరోజు మిసెస్. ఎ. హుసేన్ పాట్నాలో మీకు స్వయముగా కనబడగలదు. పర్వతం మహమ్మదుదగ్గరకు రాకపోతే మహమ్మదే స్వయంగా పర్వతం దగ్గరకు వెళ్తాడు. తెలిసిందా? మీదైన

— అసగరీ.

నోటు:—ఈ జాబు యెవరైనా ముల్లా, హాజీ లేదా మాల్వీ చేతుల్లో పడకూడదు. జాగ్రత్తగా వుండాలె. దీనిపై పత్రికలవాళ్ళదృష్టి పడకూడదు. సావధానముగా వుండాలి. "అ"

౪

(అడ్రసు—)

| | |
|---|---|
| పండిత మురారీ కృష్ణశర్మ, | లాటీమహల్, |
| రూం. నెం. 36. | కాన్పూరు, |
| కలకత్తా కాలేజిహాస్టల్, కలకత్తా. | 31 మార్చి 1926 |

ప్రియమురారీ,

తే 19-11-25 ది వ్రాయబడి పోస్టుచేయబడిన నీ జాబు నీ ప్రియతమునిచేతులలో 1926 మార్చినెలలో పడింది. ఇందులో జాబుదిగాని, నాదిగాని, మీదిగాని, తప్పేమీలేదు. నీ వొక సంవత్సరంనుంచి పూర్తిగ కలకత్తాలోనే వున్నావనిన్నీ ప్రయాగ రానేలేదనిన్ని వినివున్నాను. నే నో సంవత్సరం జైల్లో ఉన్నా. ప్రపంచంలోలేను. చాలా రోజులునుంచి జాబు జవాబులు నిల్చిపోయినా ఈ జీవిత స్మశానయాత్రా విషయం నీ చెవులకు పడేట్లు చేస్తామని జెయిలుకు పోయేముందు నామనస్సుకు వచ్చింది. కాని మళ్ళీ

యేదో ఆలోచించి ఆకోరిక నణచుకోవడమే మంచిదని తలచాను. దీనికో కారణ మున్నది. పైకి శాంతప్రసన్న మూర్తులుగా కనబడినాకూడా నీ ధనిక కుటుంబీకులు సంఘంచే సమ్మానమొందే నీవార్లు "కాపిటలిస్టు" లైన నీవార్లు, తమ "బంగారు" ధనికమురారి 'మన్ను' బీదగోవిందునితో - పాలు నీరువలె, చక్కెర గడ్డిపోచ వలె కలిసివుండడం యిష్టపడడంలేదనే విషయం నే నెరుగుదును. నీవుకూడా ఎరుగుదువు. నీకు జ్ఞాపక ముండొచ్చు. అసహాయోద్యమ సమయములో మన మిరువుర మొకచోట కూచుని "యంగిండియా" చదువుతూ మహాత్మాజీ సిద్ధాంతాలపై మన అభిప్రాయాలను అనుకూలంగా చెప్తూ వుండేటప్పుడు 'రిటైర్డు డిప్టీకలెక్టరు' నీ తండ్రిగారు ఎటువంటి కఠినోక్తు లుపయోగించేవారు; "అందరూ మోసగాళ్ళు. ఇదంతా మెదడు చెడిపోయిన వాళ్ళపని. ఇది ఆంగ్లేయుల రాజ్యం దీనికి యెదురు తిరిగినప్పుడు బాగా తన్నులు తింటున్నారు. మహాత్మా గాంధీ ఈ చెడుమంటల్ని రగుల్కొల్పుతున్నాడు. దీనితో దేశానికి సర్వనాశనం కలుగుతూంది. ఎన్నోగృహాలు నాశన మౌతున్నాయి. ఎంతోమంది చనిపోతున్నారు. అంతా మోసమే. ఎవడు నిరుద్యోగియో వాడే నాయకుడు. ఎవడికి కూలీదొరకదో వాడే వుపన్యాసకుడు. ఆంగ్లేయులరాజ్యం రామరాజ్యం. ఇందులో ఏ దుఃఖం లేదు; కష్టమూ లేదు" మొదలైనవి. ఈ మాట లంతా నాకు చాలా అసహ్యంగా తోచేవి.

అప్పుడే నీకుకూడ యివి చాలా చెడ్డవిగా వుండేవి. ఏమంటే నేను నీవుగా, నీవు నేనుగానే వుంటిమి. నేను నీ "ప్రియతమ"ను, నీవు "ప్రియుడవు"గా వుంటిమి. నేను ప్రభాతాన్ని, నీవు బాలసూర్యుడివి. నేను మందమలయ సమీరాన్ని, నీవు పుష్పమయమైన వసంతానివి. నేను అధరాన్ని, నీవు ముద్దువు. మన మొకే తరంగంలో ప్రవేశిస్తుంటిమి; ఒకే స్వరంలో మనం మాట్లాడుతూ వుంటిమి; ఒకే లయతో పాడుతూ వుంటిమి; ఒకే గతిలో నాట్యంచేస్తూ వుంటిమి; నీవు నేనుగా నేను నీవుగా వుంటిమి. నీ రక్తమాంసాల సృష్టించేవాణ్నిగా, నీ రక్త మాంసాలకు యజమానుణ్నిగా, నీ హృదయాన్ని గూడా–బలవంతంగా–నా పిడికిల్లో యిముడ్చుకోవాల్నని కోరుతూ వుంటిని. వారిచేత నిర్మించబడ్డ యీ బొమ్మను హృదయాని కదుముకొని ప్రపంచంలోని యీ అభాగ్యుడు, యీ నిర్ధనుడు, యీ అల్పుడు స్వర్గసుఖా న్ననుభవించడం వారు సహించలే కుండినారు.

ప్రియుడా! నీకు జ్ఞాపకము ఉండొచ్చు (ఏలనంటే నీ వా సంఘటన నెప్పుడూ మరచిపోజాలవు). మన సుఖ స్వప్నాన్ని మీ తండ్రిగారు త్రుంచివేశారు. మన మిద్దరం కలసివుంటే "గాంధీతుపానులో" కొట్టుకపోతా మని వారి నమ్మకం. వారి మాటల్లో – "గాంధీ ననుస రించడం మూర్ఖత. మన మాంగ్లేయరాజ్యా న్నెదిరించ డానికి మన కీ విషయంలో లోటుంది గనుక? జమీందారులం మనం, ధనవంతులం మనం, పండితులం మనం,

సర్కారుచేత గౌరవింపబడే వాళ్ళం మనం. స్వరాజ్యంలో మేమైన యింతకంటె తియ్యని లబ్ధు దొరుకుతుందా? ఇదంతా తెలివి తక్కువతనం. ఆ, ఓరోజు ఆయన ప్రయాగస్కూలునుంచి నీ పేరు తీసివేయించి రాత్రులే ఉఫ్-ఊఫ్-నా దృష్టిలోనుంచి తొలగించి లాక్కెళ్లారు. మరి నేను దేశక్షేమ యను పేరుతో ఆరునెలలు జెయిలులో క్రుక్కబడేంతవరకూ నీ తండ్రిగారు సందుపోకుండా కలకత్తాలో నీపై కాపు కాస్తూనే వచ్చారు. జాబుకూడ వ్రాయనిచ్చేవారు కారు. ఈ సంగతి నీవు స్వయంగానే వ్రాశావు ఆయనగారి ఆ పనివల్ల నీ వెంత దుఃఖితుడవు, లజ్జితుడవు, క్షోభితుడవు అయావో-జ్ఞాపకముందా? నీ ఆ జాబు యిప్పటికీ నావద్ద వున్నది దానిలో నీ విలా వ్రాశావు; - "ప్రియతమ, నా వశంలో వుండి వుంటే నా ప్రాణాలు విడిచిపెట్టి ఎగిరివచ్చి జెయిల్లో నిన్ను కలిసేవాణ్ని. నీవు జెయిల్లో నిర్దోషివైనను పవిత్రవైననుకూడ అనేకవిధాల కష్టాల ననుభవిస్తూన్నావు. నేను ఇచ్చట ఆనందంతో జీవితం గడుపుతున్నా. నాకు నీలో, నీ మార్గంలో, నీ అభిప్రాయాల్లో పూర్తి నమ్మకముంది. నా పూజ్యపిత తుచ్ఛ, మోహ, స్వార్థ భ్రమలతో కూడిన మార్గంలో వున్నారని నన్ను బలవంతంగా లాక్కెళ్ళుతున్నారని నేను యెరుగుదును. అట్లే తలుస్తున్నానుకూడ. కాని, అంతా తెలిసియుండియు యేమీ చేయజాలకున్నా. తండ్రిని బహిరంగంగా యెదిరించే శక్తి నాకు లేదు. ఎన్ని సుఖా లుండినాకూడ

ఆయన భయానక క్రోధములలోనే పెరిగాను. నా హృద యంపై భయపెట్టి పాలించుచూ నా శాసకుడు (డిప్టీ కలెక్టరు) తండ్రి నన్ను పిరికివాణ్ని చేసేశాడు. నేను నీచుణ్ని, అధముణ్ని, పిరికిపందను. నేను నీ (నా ప్రాణా నికి ప్రాణమైన నీ) కష్టంలో తోడ్పడలేకపోయినా తండ్రిలేనప్పుడంతా ఆలోచిస్తూంటా. ఇదికూడ నిశ్చ యిస్తాను. అదికూడ నిశ్చయిస్తా. కాని వారి నేత్రాలు నా నేత్రాలతో కలిసినవా, నేను పవిత్రమార్గాన్నుంచి చలించి పోతున్నా. ఇలా నే చెప్పిన దానికి నీవు చాలసార్లు నాపై కోప్పడున్నావు: నాకు ప్రేమపూర్ణ దండనకూడ విధించివున్నావు. కాని నేను మరల యిదే చెప్పతున్నా. నా తండ్రిని ప్రేమతో గాదు, భయంతో చూస్తున్నానని, వారు మొదట డిప్టీకలెక్టరు. తర్వాత తండ్రి.' మొదట వారు శాసన కర్తలు, తర్వాత దేవత. నేను నిర్భయంగా అవసర మయినప్పుడు నా పూజ్యుడైన తండ్రి అభిప్రాయాల్ని ఆదరపూర్వకంగా యెదిరించడానికి తగిన బలం నాకు యిమ్మని రోజూ భగవంతుని ప్రార్థనచేస్తూవుంటున్నా. నీ ప్రేమకు జోహారులు అర్పిస్తున్నా. ఏదినం నాకీ శక్తి కలుగుతుందో ఆదినం నన్ను నేను ధన్యుణ్ననుకుంటా. మరి మరల జీవన్మరణములలో, విహారములలో, యుద్ధము లో, సంపత్తులో, విపత్తులో, జైలులో మరి వధ్యశిల మీద అన్నిచోట్లకూడ నిన్ను విడువ కుంటా. నేడుకూడ

నా పవిత్రతకు సృష్టికర్తవు నీవే. నేడుకూడ నా హృదయ గంగకు హిమవత్పర్వతమవు నీవే. "

నాకు నీ జాబుయొక్క యీభాగం బాగుగా జ్ఞాపకం వుంది. అంచేత మరి నీకు నా అంతిమసజ్జైలు యాత్రా సూచన తెలుపలేదు. నీ వేమైనా నీ తండ్రికి యెదురుతిరిగి నా నాయకత్వం క్రిందికి వస్తావేమో, మరింత కష్టాలు యెక్కువౌతవని నేను తలచాను. కొంచెం కళ్లు తెరచిచూస్తే ప్రపంచం మనం తలుస్తూండేట్లు సరిగాలేదని తెలియనౌతుంది. సోదరా యిది చాల భయంకరమైన మార్గంగా తోస్తుంది. ఈ మార్గంలో తొట్రుపడని పాదాలుగల పథికు డెవడూ లేడు. నాల్గువేపులూ హాహాకారాలే. చేసినా భయమే, చేయకున్నా భయమే. అబద్ధం చెప్పటం కూడ పాపమే నిజం చెప్పటంకూడ పాపమే. సజ్జనుడవడం, వుదారుడుకావడం, సుహృదయుడవడం, మానవుడవడమున్నూ మహాపాపంగా వుంది. మంచిది, ఇది చెప్పు: మోసాలతో నిండి, అవిశ్వాసపూర్ణమైన యీ ప్రపంచంలో నీ యట్టి రత్నాన్ని తీసికొని చేతులలో యెగురవేసికుంటూ ఎవడు తిరుగగలడు? ఎవడైనా దోచుకోవచ్చు, ఎవడైనా లాక్కోవచ్చు.

నీ వుత్తరం నాలుగుమాసాలతర్వాత దొరికింది. మధ్యకాలంలో ఏం ఘటనలు కల్గినవో నీకు నీ "స్టూడెంటు" మహోదయకు యేమయిందో నాకు సంగతే తెలియదు. అన్నిటికంటె ముందు ప్రయాగ - నీ యింటికి పోవడం మంచిదని తలచా. చాలారోజులు

గడచినైకూడా, ఒకసారి అందర్ని అన్ని ప్రదేశాలనూ, నిండా ప్రేమతో చూచుకుంటూ. బహుశా నీవుకూడ దొరుకుదువను ఆశకూడ వుంది. ఈ ఆశతోకూడ అనేక వుపఆశలుకూడ వున్నై. కాని అచటికి చేరినమీాదట విశేషవిషయమేమీా తెలియలేదు. నీ విప్లవంలో "నీ మనస్సున" కథీనుడవై చరిస్తున్నావని తెలియవచ్చింది. ఏండ్లతరబడి ఇంటికి రావడమూ లేదు. నెలల తర బడిగా ఉత్తరాలు వ్రాయడమూ లేదు. వ్రాసినాకూడ కేవలం డబ్బుకొరకే! నేను, మీా తండ్రిగారూ, మాట్లాడుకుంటూండే సమయంలో మీా తల్లికూడ అచటవున్నది. నీ చర్చ బయల్దేరినప్పుడు ఆమె యిలా అన్నది.

"పెద్దబ్బాయి, వాడైతే మమ్ముల పూర్తిగా మర్చి పోయినట్లే వుంది. సంవత్సరం మించిపోయింది. తల్లిని చూడడానికి ఒకమారైనా రాలేదు. నేను 'చిన్నబ్బాయి' ఇంత నిర్దయుడని తలచలే. నేను వీరితో (నీ తండ్రివేపు చూచి) చిన్నబ్బాయిని పిలిపించం డని వేయిసార్లు చెప్పాను. ఇప్పుడు కాలేజీనుంచి వేరుపరచండి. నచ్చ జెప్పి పెండ్లిచేయండి. ఎక్కువగా చదివి చదివి వాడు చేయి చిక్కకుండా పోతున్నాడు. వాడే మన వృద్ధాప్యా నికి పూతకర్ర. వాడే మన ధనధాన్యాలకు సిరి. వాడే మన సర్వస్వము. దశమి వెళ్లిపోయింది. దీపావళి గడచి పోయింది. మరి నా బిడ్డ నాచేతినుంచి పాలగిన్నె తీసికో

రాలేదు. ఇప్పుడు మరల జన్మించాలనా? ఇప్పుడు మరలమరల పుత్రసుఖం పొందాలనా?"

క్షణ మాగి నీ తండ్రి ముఖంవేపు ప్రశ్నార్థక దృష్టితో చూచి మరల ఆమె యిలా ఆరంభించింది.—

"వీరు 'చిన్నబ్బాయిని' కూడ డిప్టీకలెక్టరు చేయాలనే ఆలోచనలో వున్నారు. తల్లి వొడినుండి పువ్వులా సుందరమైన, బిడ్డను లాక్కొని పురుషుడు తన క్లిష్టమైన రంగులలో రంగు వేస్తున్నాడు. తన అభ్యుప్రకారం తీరుస్తున్నాడు. మరి తల్లి దూరాన్నుంచి వులుకువులుకుమని చూస్తూవుంటుంది, పిల్లవానితో తన కేమీ సంబంధం లేనట్లు. ఇంత సంపత్తుండికూడా నా చిన్నాడు ఎవడికైనా గులాంగుండడం నా కిష్టంలేః నాకు వేరే ఎవడైనా వున్నాడా? కాని ఆయన యెవరిమాటైనా వినిపించుకుంటాడా? ఈయనేమో వాణ్ని డిప్టీకలెక్టరు చేసిగాని వూపిరి సలుపుకోరు; నేను చావనీ, బ్రతకనీ, నా బిడ్డ దేశంలో వుండనీ, పరదేశంలో వుండనీ."

నీ తల్లి నేత్రాలు నీళ్లతో నిండినై. నీ తండ్రి ముఖ మెర్రబడింది. ఆయన తల్లితో యిలా అన్నారు: "కన్నీళ్లొచ్చినైగదా? నేను చెప్తాతున్నా వూరుకో. మోహంతో మెత్తదనంతో లేదా తల్లి హృదయంతో ప్రపంచ మెప్పుడూ జరుగదు. ప్రపంచంలో రాయి మాదిరి అరుగుడుబడ్డతర్వాత "సాల్గ్రామం" కావడానికి వంతొస్తుంది. కూలివానిమోస్తరు కష్టపడితే కడుపునిండా భోజనం దొరుకుతుంది. డిప్టీకలెక్టరుపనేం

విషంకాదు. దాని ప్రతాపంచేతనే ఇప్పు డింత మాన మర్యాద వుంది. నేనుగాని చిన్నబ్బాయిని డిప్టీకలెక్టరు మార్గాన నడిపించకపోతే వాడుకూడా నీ యీ (నావేపు చూపిస్తూ) "పెద్దబ్బాయి" మాదిరి యింటికి రేపు పనికి రాకుండా పోతాడు. ఎచ్చరైనా లెక్చరిస్తుం టాడు. మరోచోట ముష్టివాళ్ళ తహాశీల్దిరి చేస్తుంటాడు. ఒకప్పుడు కోర్టులో, ఒకప్పుడు జైలులో కనిపిస్తాడు. నీవు కేవలం ప్రేమ చూపించడం, కన్నీరు కార్చడం మెరుగుదువు కాని ప్రపంచం కేవలం ప్రేమ కన్నీళ్ళు కాదు."

తల్లి తండ్రిని వేరేవిషయంలోకి మార్చాలని చూచింది. చిన్నబ్బాయి విషయంలో సతీపతుల అభిప్రాయం ఒకటిగా వుండడం అసంభవమని ఆ సమ యంలో ఆయన నేత్రాలు తెలుతూవున్నై, ఆమె మరల నాతో ఇలా అన్నది.

"పెద్దబ్బాయీ, నీవు నీ పెళ్ళెందుకు చేసుకోవు? 'ఒకమారు జైలుకెళ్ళావు' రెండోమారు జైలుకెళ్ళావు- ఇంక యెంతకాలం దేశం గాంధీజీపేర సంసారవిషయాల్తో సంబంధంలేకుండా వుంటావ్! వెనుకటిసారి చిన్న వాడొచ్చాడు అప్పుడు వాడితోకూడ యిదే చెప్పా: చూడు, నాశక్తిలోవుంటే యిప్పటకే నా కోడలు యింటికి వచ్చి వుండును. పెండ్లీడు దాటిపోతూ వుంది. ఇప్పుడు పిల్లచేష్టలు చేయకు' అని. దానికి వాడిచ్చిన జవాబిది; మొదట పెద్దబ్బాయిని పెండ్లి చేసుకోమని చెప్పు.

తర్వాత నాతో చెప్పావువుగాని, పెద్దబ్బాయిని నీ కొడుకని నీవు తలచడంలే? పెద్దబ్బాయి మనిషిగాదూ? ఆయన పెండ్లి చేసుకోనంతవరకూ నేను కూడా చేసుకోను."

నేనన్నా – "అమ్మా నే నేమొ నా పెండ్లి తప్పక చేసుకుంటా. కాని అలాంటి పెండ్లివల్ల నీ సంఘంవారు యెక్కువ కోప్పడతారు."

"ఏం? ఎందుకు? పెండ్లయ్యేది నీకూ, కోప్పడేది సంఘస్థులా – ఎందుకు?" అని నీ తండ్రి అడిగాడు.

"సంఘం ఎందుకు కోప్పడుతుందంటే", నేను నవ్వుతూ జవాబిచ్చా. "నేను వారిష్టప్రకారం గాదు. నా యిష్టప్రకారము పెండ్లి చేసుకుంటా. ఇష్టమైందా కుమారిని గాని, లేదా వితంతువును గాని. మనస్సు కలిసిందా బ్రాహ్మణకన్యను పెండ్లిచేసుకుంటా. మనస్సు కలిసిందా విజాతికన్యనుగాని, విదేశీయకన్యనుగాని పరిగ్రహిస్తా. నీవే చెప్పమ్మా, యీ పని నీకు ప్రసన్నంగా వుంటుందా? సంఘం సంతోషిస్తుందా?"

"ఇదీ గొప్పపనే" నీ తండ్రి మరల వుగ్రుడైనాడు— "విచ్చలవిడిని నీవు గొప్పతన మంటావా? ఇది సూటిగా నీ సంఘాన్ని, దాని నియమాల్ని అవమానపర్చడ మౌతుంది. సమాజపు టుత్తరువు లేకుండా వితంతువివాహం, అవర్ణ వివాహం సల్పడం గొప్ప

మాధ్యం. కనీసం యిట్టి వూహా యే బుద్ధిమంతుడూ చేయజాలడు."

నే నన్నా - "క్షమించండి. నేనే ముసల్మాను కన్యను పెండ్లాడిన మీకు నాతో సంబంధం వుంచుకో డంలో ఏమీ అడ్డంకి లేదుగదా ?"

"ముస్లిం కన్యతోనా," బొమ ముడివైచి ఆయన యిలా అన్నారు - "నీవేమొ నీవే. నా స్వంత కొడు కైనా యిలాంటి చెడ్డపని చేశాడా నేను వాణ్ణి యింటి నుంచి తరిమివేస్తా. నేను బ్రాహ్మణ్ణి, సనాతనుణ్ణి. ఈ నూతనయుగపు క్షణిక అశుద్ధప్రవాహంలో నా ప్రాణాలు పోయినాకూడా నా పవిత్ర ప్రవాహాన్ని కలుపజాలను. మహాశయులారా, సోదరులారా యిప్పుడే యీ దేశంలో యీ మతప్రచారం కాదు - సాగదు - సాగదు."

ఇది నీతండ్రిగారి అభిప్రాయం. వారు తన విశ్వా సంపై దృఢం గున్నారని నా దృఢమైన నమ్మకం. ఇక నీ యభిప్రాయ మేమని నన్నడుగుతావా ? ఈ ప్రశ్నకు జవాబు నీతో కలిసినతర్వాత చెప్పగలను. నీ స్వభావం, నీ పరిస్థితుల నాలోచించితే నే నీ క్రిందివిధముగా ఆలో చింపసాగుతున్నా.

"ఇదియును కష్టమే అదియును కష్టమే
తలవంచి జీవితాల్ గడుపు టే విధమొ ॥

నేను కలకత్తా వచ్చే వుద్దేశ్యం స్థిరమై వుంది. కాని నీవు మాను పుచ్చుకోడానికీ, ముద్దెట్టుకోడానికీ, ఆహ్వానించివున్నావు. ఈ ఆహ్వానానికి సిద్ధపడి రావాల్సింది. ఇప్పుడే పెండ్లామనే ప్రభుత్వపు పుట్టింటినుంచి వస్తున్నాను. గడ్డం దుబ్బువలె పెరిగివుంది. తలవెంట్రుకలు మునులసంపత్తై పోయినై. నీవు భావుకుడగున్నావ్. సౌందర్యోపాసకుడుగా వున్నావు. నరిగిస్ వల్లభుడై వున్నావు. నా యీ పొడుగాటి గడ్డాన్నెలా నీదిగా చేసుకుంటావ్? కనుకే పీలైనంతత్వరలో బాగా నునుపు చేసుకుని కౌగిట్లోకి వస్తున్నా.

బహుశా యేప్రిల్ యెనిమిది తొమ్మిది తేదులలో వస్తా. కాని ఒక షరతుంది. ఎవరి నేత్రాలు సరిగా నా నేత్రాలవలె నున్నవో, మరి నీ దృష్టిలో నా సోదరి వలె వుందో వారికి నాకు ఒకరోజు తప్పక చూపించవలసి వుంది.

కలకత్తా వచ్చినప్పుడు పిలకలేకుండా, లుంగీతో కాకుండా, పిలకతోను ధోవతీతోను నిన్ను చూడగలనని ఆశిస్తున్నా."

నీకే ప్రియమైన,

శ్రీ గోవిందహరిశర్మ.

## 5

(అడ్రసు:—)
నా. మురారీ కృష్ణ,
రూము నెం. 86,
కలకత్తా కాలేజి హాస్టల్,
కలకత్తా.

జకరియా స్ట్రీట్,
కలకత్తా.
(పన్నెండు ఘంటలరాత్రి)

…………!

భూలోకమందున ఆనందములో యుండె
నాప్రియున కేమేమి బిరుదు లున్నవియొ
"కాబ" యని వ్రాయ "క్లిబ" యని వ్రాయనా
భగవంతు డని వ్రాయ తగియుండునా॥

వహావ్వా, వహావ్వా! ముప్ఫైసార్లు సూర్యుడుదయించాడు. మరి క్రుంగేడు; అతిదీర్ఘమైన పగళ్లు ప్రకాశించినై. నల్లబడిపోయినై గూడ. గొప్పరాత్రులు వచ్చేయి, వెళ్లిపోయినై; కాని నీవొకచీటినైనా పంపలే. ఈ మధ్యలో నీ కలకత్తా కాలేజి హాస్టలుకు రెండు జాబులు వ్రాశా. కాని ఫలితం సున్న. నీవే యీ విధముగా తయారుకాలేదు. నాహృదయమూ నన్ను క్షమించాలె, రాతిని పూజించేవాళ్లు పూర్తిగా రాళ్లయిపోతారాయేం? రామాయణంయొక్క ఓ మంచిప్రతి యిచ్చి వెళ్తానన్నారే; ఎందు కిచ్చిపోలేదు? నేను చదివిన తర్వాత – ప్రేమచందు "సేవాసదన్", మైథిలీ

శరణగుప్త "భారత భారతీ" చతురసేనశాస్త్రి "అంతసల్" మీరు తీసుకపోతానంటిరే; ఎందుకు తీసుకపోలేదు ? వారాలతరబడి పుస్తకాలు నా మేజాయెదపై సవారిచేస్తున్నై. నేను మీదాన్ని. నామేజా మీదికాదు. ఆ మూగిదైన అబలమీద ఇలాంటి అత్యాచారాన్ని యెందుకు జరుపుతున్నారు. "......25 మేలో నన్ను హిందీలో పరీక్షిస్తానని చెపుతూవచ్చారు. ఆరు నెలల్లో దాని నెంత తెలుసుకున్నానో చూస్తానన్నారు" మరి ? ఆ పరీక్షేమైంది ? ఎంచేతేం రాలేదు ? నిర్దయుడా నీ పరీక్షలో ప్యాసుకావడానికిగా నే నెంత పరిశ్రమతో, యెంత హృదయానందంగా, యెన్ని ప్రయత్నాలతో హిందీని చదివితినో తమ రేమెరుగుదురు ? ఎన్నో పుస్తకాలు నమిలిపారేశా. ఎన్నోపుస్తకాలు రంగులో ముంచేశా. సంపూర్ణ "విదుషీ" "విశారద" యోగ్యతలు సంపాదించా. కాని తమరు రాలే – తమరు రాలేదు. దీని అర్థం యేమి ? మీసేవకురాలు నర్గిస్ "మీరా" మాదిరి తంబుర తీసుకుని మురారికై సన్యాసికావాలని కోరుతున్నారా ? నాకు గిరిధర గోపాలుకంటె మరెవ్వరూలేరు" అను గీతికతో భూమ్యాకాశాలు చలింపజేయాల్నా ? పొరబాటునగూడ ఇలా తలచవద్దు. పుస్తకాల్లోని "మీరా" కాలేజీలో ఇంగ్లీషు చదువలేదు. మరి మీ నర్గిస్ చదివుంది. అవసరం కలిగినప్పుడు ప్రేమతో నవ్వి – "తుమ్మెదా, మేము అలతలుకాము" అనికూడ చెపుతుంది.

మంచిది. ఇప్పుడు అవసరమైన విషయాలు విను. నేను నిన్నటినుండి జకరియావీధిలో నాతండ్రిస్నేహితుని యింట్లో వుంటున్నాను. ఇక రెండు మూడుదినాల్లో అధిక గణన కొచ్చే రెండుమూడు విషయాలు జరిగినవి. వాటిలో మొదటివిషయం ఆ 'యాకూబ్ లేడ్ చవట' (ఇక అతణ్ని నే నా పేరుతో పిలుస్తా) మొన్న నాతో మాట్లాడ్డానికి హాస్టలుకు వచ్చాడు. మొదటిసారి మీారు నావారైన సమయంలాంటి సాయంకాల సమయ మది. నేను నిన్నే ఎదురుచూస్తూ హాస్టలుగేటు కెదురుగా తోటలో తిరుగుతూ వున్నా. నే నే కోరికల్లో మగ్ననై వున్నానో యే మెరుగుదురు? హఠాత్తుగా ద్వారందగ్గర బైసికిల్ఘంట వినిపించింది. నేను చకితనైనా. కళ్ళు పెద్దవైనాయి. ముఖం యెరుపెక్కింది. మీా రొచ్చారని హృదయం తలచింది; కాని యెక్కడ? బైసికిల్ వాలాను చూడగానే హృదయంలోని ప్రేమ ద్వేషమనే వుడుపును ధరించింది. వాడు యాకూబ్!

"మీాకు ఆనాటి నా మాటలు జ్ఞాపకంలేవా? మీా రిప్పటికీ ఆ కాఫిర్‌ను వదలిపెట్టలేదు - ఏల?"

నాకు చాల కోపం వచ్చింది. నేను కఠోర స్వరంతో అతణ్ని "మీారు యే అధికారంతో యిక్కడికి మాటిమాటికి వస్తున్నారు? ఎవరి వుత్తర్వుతో?" అని ప్రశ్నించా.

"వుత్తర్వా, అధికారమా?" అతడు మూతి ముడుచుకొని జవాబిచ్చాడు - "మురారికృష్ణ డెలా

వస్తున్నాడో నేనూ ఆ పర్మిషన్‌తోనే వస్తున్నా. అధికారంమాట అటుండనీయండి. మీ దృష్టిలో మంచి కుటుంబస్థుడు, బాగా చదువుకున్న మహమ్మదీయునికి యోగ్యత, గౌరవమూ ఒక హిందువుకున్నంత లేవా?"

నే నన్నా – "చాలిక సెలవుపండి. నేను మీ యీ మాటలు వినదలచలేదు – వినలేనుకూడాను. మీరు నా యజమానులు కారు. గార్డియనూ కారు. మరి నేను వారికి విరుద్ధంగావుండే నా యజమాని, గార్డియను, చివరకు దేవుని మాటలుకూడ వినజాలను. మీరు నా మేలుకోరేవారు గనుక కృతజ్ఞత తెలుపుకొంటున్నా. చాలు ఇక తమ రెళ్ళండి."

అత డన్నాడు – "నర్గిస్"

నే నన్నా – "వూరుకోండి, ఈ విధంగా నా యిష్టానికి విరుద్ధంగా, నాపేరు వుచ్చరిస్తూంటే, బాగా చదువుకున్న వుత్తమవంశపు మహమ్మదీయుడు సిగ్గుపడాల్సుంది."

అత డన్నాడు – "ఇంత అమర్యాద, నిర్దయురాలు కావడం సరికాదు. నా స్థితిపై దయవుంచు. దేవునితో నర్గిస్, నేను నిన్ను ప్రేమిస్తున్నాననీ చెప్తున్నా."

"హ హ హ హ" అని నేను నవ్వా—

ప్రేమ యేమైనది పరిచయమే లేదుగా
ఎట్టివిశ్వాసమొ ఎంతటి ప్రేమయొ
ఎక్కడిమోహమో మెరుగుపెట్టులనో॥

ప్రేమ బెదిరించదు. ప్రేమ యెవరిమార్గంలోనూ కంటకం కాదు. సిగ్గులేనిదికూడ కాదు. మియా, ప్రేమంటే యేమొ నీ కేం తెలుసు ?

అత డన్నాడు — "నా ప్రేమ మహమ్మదీయుని ప్రేమ. హిందువుని ప్రేమ మంచుగడ్డవలె చల్లబడిపోతూంది. నా ప్రేమ అగ్నివలె ప్రజ్వలిస్తూంది."

నేను కోపంతో అన్నా — "మీ ప్రేమాగ్నిలో నిప్పుపడనీ. యిప్పుడు తమరు తమ ప్రేమాగ్నిని నా దృష్టినుంచి దూరంగా తీసుకుపొండి. నన్నెక్కువగా మండించొద్దు."

అత డన్నాడు — "నీవు నిప్పుతో చెల్లాటలాడుతున్నావ్."

నేనేమీ జవాబుచెప్పలేదు. పెడముఖం పెట్టాను.

ముక్కుపుటా లెగరేస్తూ, ముఖ మెర్రజేసుకుంటూ అత నన్నాడు — "దేవునితోడు. నా ప్రాణం పోయినాసరే నీవా హిందువుతో నవ్వుతూ మాట్లాడడం, చూడడం నాకిష్టంలేదు. జ్ఞాపక ముంచుకో. ఈ విషయంలో నీవు మూర్ఖంగా, అనాలోచితంగా ప్రవేశించావా, పశ్చాత్తాప పడవలసి వస్తుంది. రక్తపాతం జరుగుతుంది."

వాడు వదరుతూవున్నాడు. నేను నా హాస్టలు వైపు తిరిగిపోయా. మీకు తంతి యిచ్చి యీ యాకూబ్ చవటనుంచి నన్నెందుకు రక్షించరో అని చీవాట్లు పెడదామని మనస్సునకు వచ్చింది. కాని యే శక్తితో

మిమ్ముల్లను చీవాట్లు పెట్టేది? మీరు పూర్తిగా నెల నుంచి నా క్షేమమే తెలుసుకోకపోతిరి ఈసమయంలో కలకత్తా కాలేజి హాస్టల్‌కు వచ్చి మిమ్మల్ని వెదుకుదామని ఓసారి అనుకున్నా. కాని మీమాటలు జ్ఞాపకానికి వచ్చినై. హాస్టల్‌కు రాకుండేట్లుగా నాచేత ప్రతిజ్ఞ చేయించుకున్నారు. మీ రిలా అన్నారు – "కాలేజీ హాస్టల్స్‌లోని యువకులు నూటికి తొంభైతొమ్మిదిమంది వారి మధ్య గొప్పవంశములోని యువతులు తిరుగజాలినంత యోగ్యులు కారు." విధిలేక నిరాశతో నాగదిలోకి పోయి నిద్రపోయాను. కాని సుఖం కలుగలే. మీరు యెక్కువగా తలంపుకు వచ్చారు– యెక్కువగా. ప్రియుడా, యీ హృదయవేదనపేరేనా ప్రేమ? ప్రేమ వేకువ, దీర్ఘవిశ్వాసాలు, కన్నీళ్ళు, సుఖములేని పొర్లింత లేనా వుండేది! అయ్యో!

"ఎరుగనైతిని ప్రేమను అనుభవింప
దుఃఖములుకూడ పొందక తప్పదనుచు
గుండె లవియును హృదయము కలతనొందు
వెక్కివెక్కియు బావురుమనుచు యేడ్వ
కనుల నీరునునించుటగూడ నగును
గిజగి లని తన్నుకొని పొరలాడుచుంట
మనసు స్థిరతను గోల్పోవు ననుచుచూడ."

ఇలా ఆలోచిస్తూ ఆలోచిస్తూ కళ్ళు మూతలు పడినై. తర్వాత యెవరో భోజనానికి లేపిన ట్లనిపించింది. కాని యేం తినేది? నా ఆకలి నెలనుంచి యెలా అంతర్ధాన

మైపోయిందో నాకే తెలియదు. మరుదినం ప్రొద్దున్నే కామన్‌రూములో నాకోరకు యెదురుచూస్తున్నారని యెవడో చెప్పాడు. నేను గాభరాపడ్డా. దేవుడు మేలుచేయుగాక! ప్రొద్దుట్నుంచీ యెవరో మొండికేసి కూర్చున్నాడే! అక్కడికి పోగా, ఆ మనిషి నా ప్రియమైన తండ్రిగారు. ఆయన్ను హఠాత్తుగా కలకత్తాలో తెల్లవారుతూండగానే హాస్టలులో చూచి నా ప్రాణాలెగిరిపోయినై. చూడడంతోనే మెదడులో నానావిధమైన అభిప్రాయాలూ సుడివడసాగినై.

"నర్గిస్ !"

"నాన్నా !"

"ఈ విధంగా హఠాత్తుగా నేను నీ యెదుట వుండడం చూచి ఆశ్చర్యంలో పడి వుంటావు ?"

నేను వూరుకున్నా.

మా నాన్న అన్నాడు, "నేను నిన్ను లక్నో తీసుకపోవడానికి వచ్చాను. ఇవ్వాళ మధ్యాహ్నం బండికే వెళ్లాలి."

నా ముఖం నల్లబడింది. గుండె దడదడ కొట్టుకో సాగింది. కండ్లు చీకట్లు క్రమ్మసాగినై. వదినె నాన్నకి అన్నిసంగతులూ చెప్పేసిందా? తప్పక అలానే అయి వుండాలి. లేకపోతే ఈయన యీవిధంగా కలకత్తా కెప్పుడూ రారు. ఇప్పుడు ఈయనతో యెలా మాట్లాడేది ? యేం చెప్పేది ? యేం చెప్పకుండేది ? తండ్రి ! ఆ స్థితిలో నా హృదయ మెంత దృఢమయిందని తలుస్తు

న్నానో, ఆయన యెదురు పడేటప్పటికి ఆ ధైర్యమంతా మాయమై పోయింది. కొంచెం నా ప్రపంచంలో కేవలం యిద్దరు వ్యక్తులు మాత్రమే మిగిలారు. ఒకడు క్రోధాన్వితుడు, కఠినహృదయుడయిన మా నాన్న. రెండవది వారి ఆకారాన్ని నేత్రాన్ని చూచి వణకుతుండే నేను. స్మృతి తప్పి పడిపోతానేమో అనిపించింది. కాని ఆ సమయంలో మీ మందహాసచిత్రము నా కళ్లయెదుట కనబడింది. నేను సర్దుకున్నా. మీ చిరునవ్వు యెదుట కేవలం నా తండ్రిదే కాదు, సమస్త ప్రపంచంలోని క్రోధమంతాకూడ తుచ్ఛంగా నాకు తోచసాగింది.

తండ్రి అన్నాడు — "వూరకే నిలుచున్నావేం. ప్రయాణానికి సిద్ధం అవు. నే నిప్పుడే నీ వార్డెతో మాట్లాడుతా. ఇక నీ చదువు యింతటితో సరి."

"ఎందుకు ?" అని నే నడిగా.

"ఊరికే! నే నిదే వుచిత మని తలుస్తున్నా."

నేను నా శరీరంలోని బలమంతా నాలుకమీదకు చేర్చి ఆయనతో చెప్పా—

"నాయనా, నే నింకా చదువుకుంటా."

"మంచిదే. చదవొచ్చు, కాని కలకత్తాలో కాదు. ఇంటిదగ్గర యెవరైనా దొరసాన్ని కుదిరిస్తా.

నే నన్నా — "నే నిక్కడే వుండి చదవాల్నని వుంది."

తండ్రి కర్కశస్వరంతో జవా బిచ్చాడు_ "ఇప్పుడది అసంభవం. ఈ విషయంలో నే నెక్కువ వాదించ

దలచుకోను. కాని నీ విషయం మాత్రం అణుమాత్ర మైనా తప్పిపోకుండా అంతా నాకు తెలుసనిమాత్రం చెప్పేస్తున్నా. నామాటల అర్థం సాఫుగా తెలియాలంటే ఇదిగో – చూడు."

తండ్రిగారు ఒక కవరు నాయెదుట పడేశారు. దానిలో జాబు తీసి చదివా. అది యాకూబ్ వ్రాసింది. ఆ పిశాచి మన విషయాల్లో వున్నదీ లేనిదీ కలిపి నా తండ్రి కిలా వ్రాశాడు – "తమరు త్వరలో యేదయినా వుపాయ మాలోచించకపోతే తమకు చెడ్డపేరొస్తుంది. తమ కూతురు ఒక కాఫిరువెంట లేచిపోతుంది."

"జాబులోని సంగతు లబద్ధమా?" అని కోరారు. నేను దృఢంగా జవాబిచ్చా. "కావు" అని.

"ఇందుకే ని న్నిక్కడనుంచి ఇంటికి తీసుకు పోవ డానికి వచ్చాను."

నేను చెప్పా – "నాన్నా, క్షమించండి. ఇందుకనే నేనింటికి రాగోరడంలేదు. రానుకూడాను. నేను స్థిరం చేసుకునే వున్నా."

"ఏం నిశ్చయం చేసుకున్నావ్?" అని తండ్రి గర్జించి అడిగాడు.

"ఇదే – నేను వారిని.............."

"సిగ్గులేనిదానా, మూర్ఖురాలా! నీవు నావంశానికి కళంకం తెచ్చావు."

"ప్రేమపేరు కళంకం కాదు, నాన్నా."

"వాడు కాఫిర్, మనం ముసల్మానులం; వాడు వేయిరెట్లు మంచివాడయినా మనకు చెడ్డవాడే."

"ఆయన మనిషే; మనమూ మనుష్యులమే. మనలో కాఫిర్ గాని, ముసల్మాన్ గాని యెవడూ లేడు."

నామాటలకు ఆయన కోప్పడ్డారు. ఆయన కళ్లెర్రబడ్డాయి. తలవెంట్రుకలు నిక్కబొడుచుకొన్నాయి. ఆయన కాళ్లు దబదబ కొడుతూ గదిలో తిరుగసాగారు.

"నీవు గ్రుడ్డిదానివి, నర్గిస్!"

"నేటి ప్రపంచాన్ని చూస్తుండేదానికన్న గ్రుడ్డివాళ్ళలా వుండడమే మంచిది. మానవుని ద్వేషంతో, శతృత్వంతో నీచఆకారంతో చూస్తుంటే ఈకళ్ళు యికేంపనికి. నాకు సరళమైన విషయాలే తెలుసు. ప్రపంచం భగవంతునిది. శేఖులు భగవంతునివారే. బ్రాహ్మణులు భగవంతునివారే. కాఫిరు భగవంతునివాడే. మరి ముసల్మాను భగవంతునివాడే."

నాన్న మౌనం వహించారు. ఏదో ఆలోచిస్తూ పచారు చేస్తున్నారు. తర్వాత యిలా చెప్పసాగారు – "నేను సూఫీసాహెబుగారి యింటివద్ద బసచేశాను. ఇవ్వాళ అక్కడ మతసంబంధమైన సభ ఒకటుంది. మన మక్కడ వుండడం చాలా అవసరం. ఆయన నిన్ను కూడా పిలిచారు. పద, టాక్సీ నిలబడివుంది.

నేను చెప్పా — "ఇప్పుడే గుడ్డలు మార్చుకుని వస్తా."

టాక్సీపై కూర్చున్న తర్వాత నాన్న యిలా అన్నారు – "నర్గీస్, ఇప్పుడు నేను నిన్ను తీసుకుని స్టేషనుకు తిన్నగా వెళ్ళిపోతే ?"

నేను నారవికజేబులో వున్న చిన్న డబ్బీని తండ్రికి చూపిస్తూ యిలా అన్నా —"ఇది నన్ను లక్నో పోకుండా రక్షిస్తుంది"

"ఇందులో యేముంది ?"

నేను నా తండ్రియెదుట భయంలేకుండా మొదటిసారి నవ్వి చెప్పాను—"విషం!"

సూఫీ సాహెబ్ చాల పవిత్రమైనవాడు. కేవలం కలకత్తాలోనే గాకుండా మా ప్రాంతంలోగూడ వీరిని గౌరవిస్తారు. నేను వీరిని నా బాల్యంనుంచీ యెరుగుదును. వీరు సంవత్సరాని కోమారు మాయింటికి వచ్చేవారు. వీరికి చాలామంది శిష్యు లున్నారు. సంవత్సరానికి వారికి చాలా వేల రాబడి వుంది. కాని ఆయన రాబడిలో ప్రతి పైస బీదలకు, రోగులకు, అనాథలకు ఖర్చౌతుంది. వారిచ్చట జకరియాస్ట్రీటు—నెంబరు భవనంలో వున్నారు.

వారి దర్వాజాదగ్గర మా టాక్సీ ఆగేప్పటికి వారింట్లో భజన జరుగుతూవుంది. చాలామంది ముసల్మానులు చప్పట్లుకొడుతూ పాడుతున్నారు. మొదట సూఫీ సాహెబ్‌గారు ఒంటరిగా పాడుతున్నారని, తర్వాత తక్కినవారంతా యేకంగా పాడుతున్నారనీ, బయట నుంచే స్పష్టంగా తెలుస్తోంది. టాక్సీలోనుంచి దిగి మే

మింట్లో మూరాం. కాని కొంతదూరం పోగానే నేను తండ్రిని ఆపాను.

"నాన్నా, కొంచెం సే పాగండి. భజన పూర్తయిన తర్వాత పోదాం. లేకపోతే సూఫీసాహెబుగారి ధ్యానతంత్రి తెగిపోతుంది."

నాన్న లోపలివరండాలో ఆగారు. పాడేవాళ్ళ సంగీతం సాగుతూవుంది.

"ఓయి భగవంత! విగ్రహమందుగూడ
కానబడుచుండు నీదగు నాత్మజ్యోతి
మందిరం బను తెర మాటునందె మిగుల
దృష్టిగోచర మగుచుండు కాబ జగతి॥

వహావ్వా, వాహ్, ఏలాంటి సమయంలో మనం చేరాం. ఏలాంటి సామయికమైన గానం. మొదటిగీతం వింటూనే నేను తండ్రితో యిలా అన్నా—

"నాన్నా వింటున్నారా?"

నాన్నగారు దాడీపై చేయివేసి గాంభీరంగా వున్నారు. పాడేవాళ్లు తర్వాత చరణానికి వచ్చారు.

"హృదయమును పీనివలనుండి తొలగదీయ
మందిర మసీదు లను భేదంబు సమసిపోవు
ఈ రెంటియందునె జగడముల్ గోచరించు"

నాకండ్లు అశ్రుపూరితాలైనాయి. కంఠం రుద్ధమైంది. ఇలాంటి పంక్తులు వ్రాసినాయన కవియా లేక దేవుడా? నేను తిరిగి నాన్నవేపుచూశా. కాని ఆయన

కళ్లు మూసికొని వున్నారు. ఆయన స్తంభాని కానుకొని యే మాలోచిస్తున్నారో తెలియదు.

"నాదు ప్రియురాలి దర్జాను యెవ్వడేని
ఖయామతుదినమందు జూడగలడో
దేవురూపముగూడను లైలవలెనె
మజనూను కెప్పుడు దోచుచుండు!
సాకి కన్నియ సారాయిబిందు వొకటి
నాకు త్రాగించినప్పటిరోజునుండి
ఒక్కబిందువె సంద్రంబుగాను దోచు॥"

"నాయనా!"

"ఊరుకో! – చప్పుడు చేయకు."

"ఎప్పు డెప్పుడు శిరమును వంచగలనొ
అప్పు డంతయు దర్పణభాతిగాను
నాదు హృదయంబు నిర్మలంబయ్యె నయ్య
సాకికన్నియపై ప్రేమ నుంచు కతన॥"

సంగీతం పూర్తయినతర్వాత నాతల నిమురుతూ నాన్న యిలా అన్నారు.

"నర్గిస్, నీవు సరిగాచెప్తున్నావ్. నీవు సరిగా చెప్తున్నా వని నాహృదయం చెప్తూంది. నే నింతదాక దాన్ని, నిన్ను మోసగించడానికి, ప్రపంచాన్ని సంతోషపెట్టడానికి ప్రయత్నం చేస్తున్నా. కాని యీసమయంలో యీభజన నెపంతో భగవంతుడు నన్ను బాగా ముఖమ్మీద కొట్టాడు. నిస్సంశయం! ఈ రెండు భవనాల్లో జగడాలు కన్పడుతున్నై. నిస్సంశయం, నిస్సంశయం!

నా వెంట్రుకలు నెరసినై. నా చూపు తగ్గిపోయింది. నే నింక కొద్దిదినాల అతిథినే యీ ప్రపంచానికి. ఈ సత్యాన్ని నే నెందుకు దాచుతా?"

"నాన్నా, నాన్నా!" నేను వారి పాదాలపై బడ్డాను – "తండ్రీ, నామంచి తండ్రీ!"

"తల్లీ, యేడ్వవద్దు – యేడ్వవద్దు. యేడ్వాలసింది నేను – యేడ్వడం నావంతు. తప్పుదారిలోవున్నది నేను. నే నున్నాను. నేను నేటినుంచి నేను కాదు. నీ పుట్టుకకు ముందునుంచికూడ "దేవాలయమనే తెరలో కాబాదృష్టి గోచర మౌతున్నది" అనే దీన్నే ఆలోచిస్తున్నా. నీ తప్పేమీ లేదు. నీవు నా హృదయచిత్తానివేగదా! ఇందులో నీ తప్పేమీ లేదు."

ఆ సమయంలోనే సూఫీసాహెబుగారి వెనుక యిరవై ముప్ఫైమంది యింటినుండి బైటకు వస్తూండడం కనబడింది. వారిలో "యాకూబ్ చవట" గూడా వున్నాడు. వానివేపు ఈర్ష్యతో సైగచేసి నేను తండ్రితో యిలా అన్నా—

"నాయనా, మీరు వుదయంచూపించిన వుత్తరం వ్రాసిన మనిషి ఇతడే."

యాకూబ్ తండ్రికి సలాం చేశాడు.

వాణ్ణి ఆశీర్వదించి కరస్పర్శచేస్తూ తండ్రి యిలా చెప్పాడు—

"నేను నీ వుపకారభారంతో అణగిపోయినాను. నీవు నన్నికక్కశికి రప్పించి నాకు జ్ఞానోదయం కలిగిం

చావు. 'దేవాలయ మనే పర్దాలో కాబాద్రృష్టి గోచరమౌ తూం'దనేది నా కిప్పుడు పూర్తి నమ్మకం కుదిరింది."

ఇదేమిటో యాకూబ్ మనసుకు రాలేదు. వాడు భ్రమ జెందినట్లు శాంతంవహించి, నా తండ్రి ముఖాన్నీ, సంతోషంతో నిండివున్న నాముఖాన్నీ చూడసాగాడు.

ఊఫ్, మైడియర్, డియర్! జాబు వికృతంగా దీర్ఘమైపోతూంది. పన్నెండుఘంటలరాత్రినుంచి వ్రాయడానికి కూచున్నా. గూట్లో పెట్టివుండే సూఫీసాహెబుగారి క్లెంపీసు మూడుముప్పావు చూపిస్తూంది. ఇప్పుడు గూడా నా నేత్రాల్లో మీరే వున్నారు. ఇందులో సందేహ మేమీ లేదు. మీపై నిమమత నిద్రనుగూడా మించిపోయింది. ఉదయం పదిగంటలనుంచి తండ్రిగారు, సూఫీసాహెబ్‌గారు గదిలో కూచొని యేమేమి ప్లాను లేస్తున్నారో యే మెరుగుదువు. భోజనానికి లేవలేదు. బహిశ్శంఖకూ లేవలేదు. అప్పు డప్పుడు తండ్రిగారు బిగ్గరగా కేకవేసి మాట్లాడుతున్నారు; అప్పుడప్పుడు సూఫీసాహెబుగారు. కాని భయపడవలసిన విషయు మేమీలేదు. చిహ్నాలు శుభవంతంగానే వున్నాయి. ప్రేమగలవాళ్ళ మాతాం. ఆగండి. శరీరం పులకలెత్త నీయండి!

ఇప్పుడు జాబు వ్రాసివ్రాసి నిద్రతో వివశురాలైపోతున్నా. ఏం చేస్తున్నారో చూడండి? ఊఫ్. నా

దేవతా! మీ రెంత అందమైనవారూ? ఎంత మంచి వారూ? ఎంత న్యాయస్థులూ?—

"పూలు గులాబులు సూర్యచంద్రులును
అన్నియు యిట గలవు, కాని వారిలో
మిక్కిలి నాముది నచ్చినవారలు మీరే॥"

3 ఏప్రిల్ 1926
10 ఘంటలు, పగలు.

తొమ్మిది ఘంటలకు మెలకువ వచ్చింది. తండ్రి, సూఫీసాహెబుగారు నాయుడు దయగావున్నట్లు అప్పుడు చూశా. తండ్రిగారు మిమ్మ చూడాలంటు న్నారు. వింటిరా? తెలుసుకొంటిరా? నా రాజా! ఆహా! నా హృదయాన్నుంచి ఆనందజలధారలు పైకి లేవగోరుతున్నై. మీ రేచటున్నారో?

4 ఘంటలు, పగలు

రావొద్దు, రావొద్దు, ప్రియా, ఇప్పు డీ వీధిలో అగ్నిమాదిరి విప్లవం రగుల్కొంటూ వుంది. పట్టణంలో మెచ్చటో గల్లంతు జరిగిందని తెలుస్తూంది. ఆర్యసమాజి కుల వుత్సవంమీద ముసల్మాన్లు ముట్టడించారు. ఈ వీధి ముసల్మానులతో నిండివుంది. అందరూ అంధవిశ్వా సులు, వేలకొలది రక్తపిపాసులు, బద్మాషులు వున్నారు. కత్తులు, కటార్లు, ఈటెలు, గండ్రగొడ్డళ్లు అంతా వ్యా పించివున్నై. గొప్పగల్లంతు జరుగుతుందని తోస్తూంది. అగ్ని రగుల్కొనివుంది. మీరు రావొద్దని నేను చెప్తున్నా.

ఈ తుపానులో మీరు రావొద్దు. నా హృదయమా, రావొద్దు—రావొద్దు—రావొద్దు—రావొద్దు—

మీ నర్గిస్—మురారి

పి. యస్. రావొద్దు-రావొద్దు-రావొద్దు--!

## 6

(అడ్రెసు—)
శ్రీమతి సుమిత్రా దేవి,
C/o పండిత జయకృష్ణశర్మ,
దారాగంజి, ప్రయాగ.

కలకత్తా కాలేజి హాస్టలు
కలకత్తా.
6 ఏప్రిల్ 1926

అమ్మా!

చరణాలకు స్నేహ, భక్తి, ఆదరపూర్వక నమస్కారాలు.

మొన్ననే మూడవ ఏప్రిల్‌నాడు మీ సన్నిధికొక వుత్తరం వ్రాశాను అది మీకు చేరిగూడ వుంటుంది. మీ యేకమాత్రపుత్రుడైన నన్ను విధర్మి కాకుండా రక్షించుకోడానికి నా తండ్రిగారితోకూడ మీరు కలకత్తా వస్తూకూడా వుండవచ్చును. మీరు వెంటనే కలకత్తా రావడంలోనే వేరే ఒక కారణంకూడ వుండవచ్చు-అనగా యిక్కడి కలహ సమాచారం. కాని చూడమ్మా ఈ వుత్తరంలో నేనేమి వ్రాస్తున్నానో

అందులోని అక్షరశః నమ్మాలి. నా రెండో వుత్తరం రానంతదాకా యే పరిస్థితులలోనైనా యీ వైపు అడుగు పెట్టవద్దు. ఇప్పుడీ పట్టణం నరకరంగమై వుంది. ఇక్కడ ఆంగ్లేయుల ప్రభుత్వం లేనట్లే తోస్తోంది. నాల్గు వేపులా కర్రలరాజ్యం, ఇటుకలరాజ్యం, సూరకత్తుల రాజ్యం, ఖడ్గాలరాజ్యం, రౌడీలరాజ్యం, ఔరంగజేబు రాజ్యం, నాదిర్షాహరాజ్యంగానే కల్లోలంగా వుంది. ధూర్త విదేశప్రభుత్వం, అపవిత్ర విదేశప్రభుత్వం, ఈ వుపద్రవాల కన్నిటికి కారణమైనై. పర ప్రభుత్వం మేలి ముసుగులో దాగుకొని వుంది. ఆంగ్లేయరాజ్యశక్తి తన ఠానాల్లో, ఫోర్టువిలియం బారకస్సులలో కూర్చొని హిందూమహమ్మదీయ సౌభాగ్యగిడములో సొరంగాలు తవ్వుతూ వుంది. తన భయంకర కల్మషహస్తాలను దృఢపరచుకొంటూంది. హత్య, కుట్ర, తారుమారు అను పేరు వినగానే ఉగ్రరూపంతో అణచివేయడానికి భయంకరకృత్యాలను జరిపే యీ బ్రిటిషునీతి, ఈ సమయంలో కుటిల నాటకంలో నిమగ్నమయింది. రోడ్లలో గడబిడ ధ్వనులు, సందుల్లో హాహాకారాలు. నాన్నగారు యీ ఆంగ్లేయరాజ్యం యీ రూపాన్న చూచినట్లయితే 'రామరాజ్య' మనే పవిత్రనామంతో పిలవడము తప్పక మానుకుంటారు. ఇక్కడి ఆంగ్లేయుల వీధులలో సారాయి, మాంసం, నృత్యం, సంగీతం వెనుకటివలె వుంటే వుండవచ్చు. కాని హిందూస్థానీయుల వీధులలో విపత్తే కన్పిస్తూంది. కిళ్ళీకొట్ల దగ్గరున్నుంచి రత్నాల ముత్యాల

అంగళ్ళవరకు అన్నీ మూయబడినవి. బజార్లు మూత పడినై. ఎన్నో యిండ్లు తాళాలు వేయబడ్డై.

ఈ వుత్తరం మిక్కిలి కష్టంతో వ్రాస్తున్నా. ఇది చేతులలో పడుతుందో పడదో అని కూడ సందేహంగా వుంది. తపాలాఫీసులు మూసివున్నై. డెలివరీ లేదు; డిస్పాచీ లేదు. వుత్తరాలు చేర్చే భారంవహించి తమ ప్రాణాల్ని అపాయంలో యిరికించుకొనే సాహసం యే హిందువుకుగాని, ముసల్మానుకుగాని వుంటుందా? రహస్యంగా, దొమ్మీగాజరిగే ఆక్రమణాల కారణాన యింట్లోంచి బయటికి రావడమే కష్టంగావుంది. మా హాస్టల్ నాల్గవ యేప్రిల్ నుంచే మూసివేయబడింది. మూడు రోజుల్నుంచీ ముస్లింరౌడీలు విసువకుండా మా హాస్టలుపై దండెత్తుతున్నారు. కలహానికిపూర్వం హాస్టల్లో విద్యార్థులు నౌకర్లు కలిసి మొత్తం 135 మంది వున్నారు. నూరుగురు హిందువులు, 25 గురు ముసల్మానులు, పదిమంది అన్నివిధాల నౌకర్లు వున్నారు. నౌకర్లలో ఇద్దరు ముస్లిములు. ముస్లిముల మొదటి ఆక్రమణ సమయంలోనే ముస్లింవిద్యార్థు లందరూ, ఒక ముస్లింనౌకరు సమయం చూచుకుని వాండ్ల సామానుతో కూడ అంతు లేకుండా బయటికి వెళ్లిపోయారు. దేవునికి భయపడే వుత్తమ వంశస్థుడైన ఒక పవిత్ర ముస్లింనౌకరుమాత్రము ఈ ఘోర సంకట కాలంలో మమ్ముల విడిచిపెట్టి పోలేదు. అతడు పన్నెం

డేళ్లనుంచి యీహాస్టలు ముస్లింవంటవాడుగా వున్నాడు. హాస్టలు వదలిపోయే ముస్లింయువకులు అతన్నికూడ రమ్మనగా అతడు "లేదు బాబా, ఇది నావల్లకాదు. పన్నెండేళ్లనుంచి యెవరి వుప్పు కారం తినున్నామో ఈ కష్టంలో వాళ్లని విడిచి స్వర్గానికి రమ్మన్నా రాను. ఇది మూర్ఖులలడాయి. వాళ్లీ వేళ కాకపోయినా రేపైనా తిరిగివచ్చి కల్సుకోడానికి ప్రయత్నిస్తారు. ధ్యానంతో నామాటలు జ్ఞాపకముంచుకోండి. ఎవడో మూర్ఖుడు యేదో వదరుతున్నాడులే అనుకోకండి. నేను యిటువంటి వాళ్లకు సహాయంచేసి నాహృదయాన్ని దేవుణ్ణి కోప్ప డేటట్లు యెందుకు చేసుకోవడం?" అని గంభీరంగా సమాధానం యిచ్చాడు. పోయేవాళ్లన్నారు – "మహమ్మదీయులు యీహాస్టలు తగులబెట్టి యిక్కడవుండే వాళ్లనంతా నరికేయాలని అంటున్నారు. ఇక్కడుంటే నీ ప్రాణంకూడ పోవచ్చు." అతడు నవ్వి దృఢంగా జవాబిచ్చాడు – "అరే భయ్యా, ఇంతమంది వుండేచోట భయమేలేదు. ఇందరితో టిచావడంగూడా ఆనందంగానే వుంటుంది." అమ్మా, యీవుత్తమ మహమ్మదీయుడు నాపై దయయుంచి యేవిధంచేతనైనా కష్టపడి యీ జాబును హౌరాస్టేషను పోస్టాఫీసులో వేసి వస్తానని మాట యిచ్చాడు. అతని దయాబలంపైననే యీ జాబు వ్రాస్తున్నా. నాగది హాస్టల్ గేటుకు రస్తాకు సరిగా యెదురుగా మూడో అంతస్థులోవుంది. నేను కిటికీవద్ద ఓ కుర్చీలో కూర్చొని యెదుట ఓస్తూలును మేజాగా వుప

యోగించు కొంటున్నా. నా నాలుగువైపులా ఇటుకలు, రాళ్ల ముక్కలు, కర్రలు, చాలా పెద్దవి చిన్నవి, ఇనుప ముక్కలు వున్నవి. హఠాత్తుగా ముస్లింలొస్తే వారికి వీటితో స్వాగత మియ్యడానికిగా వుంచాం. హాస్టలు భాండారంలోని భోజనసామగ్రంతా మూడో ఏప్రిల్ సాయంత్రానికే అయిపోయింది. నేను 30,35 రోజులుగా చాల జబ్బుపడినానని నా మొదటి వుత్తరంలో వ్రాశాను. ఇప్పుడు యీ బలహీనస్థితిలో మూడు రోజులనుంచి వుప వాసంకూడ చేస్తున్నా. మాదగ్గర కర్రలు, మేజాలు, కుర్చీలు, పాత్రలు, గుడ్డలు, పుస్తకాలు, కాగితాలు మొదలైనవితప్ప తినగలిగిన దే వస్తువూ లేదు. మాకు మూడువైపులా ముసల్మానుల యిళ్లు వున్నవి. ఒకవైపు హిందువులవి. మేము టెలిఫోనుద్వారా పోలీసులు హిందు వులు వీరి సాహాయ్యం గోరాము. రెండు వైపులనుంచీ సహాయంచేస్తామనే సమాధానం వచ్చింది కాని, మూడు రోజులనుంచీ వుపవాసమే చేస్తున్నాము. ఈ వైపు ముస్లింలు బలంగా వున్నందున హిందువు లిక్కడకు రాలేరని నేననుకొంటా. కాని పోలీసులో? వారు యీ రోజు వుదయం ఓసారి హాస్టలుగేటులో నిల్చి రాళ్ళు వేస్తూ "ఓరి గాడిదకొడుకుల్లారా బయటికి రాండ్రా చూస్తాం" అని నోటబట్టరాని తిట్లు తిడుతూవున్న మాకనుమాత్రం వెనక్కి నెట్టారు. కాని, వ్యర్థమే. పోలీసులు అటు వెళ్ళగానే అల్లాపేరుతో అంధులైన మరోగుంపు వచ్చి మాపై బడింది.

మనం అనగా హిందువులం చాలా విచిత్రమైన వాళ్ళం. అమ్మా' రెండింతలు తీసుకోటం, నాలుగురెట్లు బడాయికొట్టడం మనకు బాగా తెలుసు. కాని నిజమైన సమయంలో పక్కలపక్కలకు తొంగిచూడడం, తల గీక్కోవడం, లేనిపోని పనులు కల్పించుకుని తొలగడం. మాబదులు యిక్కడ నూరుమంది ముస్లింలుగాని, ఇంగ్లీ షాళ్ళుగాని లేదా శిక్కులుగాని వున్నట్లయితే ఇలాంటి దుర్దశలో వుండటానికి వారు ఒప్పుకోరు. వాళ్ళల్లో 20,30 మంది చనిపోయినా లెఖ్ఖచేయరు. కాని శేషించిన వారు దర్జాగా జీవిస్తూవుంటారు. మేము నూరుమంది, నౌకర్లతోగూడ నూటతొమ్మండుగురం. మావద్ద వందలకొలది కర్రీలు, కొన్ని పిడిబాకులు, చాలా కర్రలు వున్నయ్ మేమందరం ధైర్యంగా ముస్లిములను ఒకేసారి యెదుర్కొంటే మేము ఓడడం, అవమానపడ డం అనేదే అసంభవం. కాని యీ సాహసం మాలో లేదు. ఇక్కడ ఒకడు పెళ్ళాన్ని తలుచుకొని యేడుస్తు న్నాడు. మరొకడు తల్లిని తలుచుకొని ఆడపిల్లమాదిరి కళ్ళనీళ్ళు కారుస్తున్నాడు. కుక్కలు చచ్చినట్లు చావ డానికి అందరూ వొప్పుకుంటారు. కాని సింహాలమాదిరి మరణించడాని కెవ్వడూ సిద్ధపడడు. ఇది మాకే కాదు, వర్తమాన హిందూజాతి అంతకూ వుండే భయానక దౌర్బల్యమే. ఈ దౌర్బల్యంవల్లే మన ముస్లిం సోద రులు లాభం పొందుతున్నారు. మనం దేవుడు దేవుడని కలవరిస్తాం. కాని మన దేవుని రథంపై వాళ్ళుపడినప్పుడు

మన దైవప్రేమంతా మాయమై పోతూంది. మనం మన దేవుళ్ళను మన యెదురుగ్గానే విదేశీయుల వుమ్మి వేతలకు, చెప్పుదెబ్బలకు, విరగ్గొట్టబడుటకు వదిలేసి, మన తుచ్ఛప్రాణాల రక్షణకోసం పరుగెత్తి వెళ్ళుతున్నాం. మనం మేళాలు — మేళాలు అని అరుస్తాం కాని సర్కారువారిగాని, ముస్లిములగాని చెప్పుదెబ్బ మన నెత్తిన పడిందా, గప్‌చుప్ అయిపోతాం. మనం మన మాట, మన మతం, మన దేవుళ్ళకోసం ప్రాణాలివ్వడం యెరగనే యెరుగం. అన్ని కష్టాలకు కారణం యిదే. ప్రపంచంలో బలహీనుడుగా వుండడమే పాపం. ప్రపంచంలోని పాపాలకంతా వుత్తరవాదులు అత్యాచారాలు, వ్యభిచారం చేసేవాళ్ళు కారు. కాని అత్యాచారాలను, వ్యభిచారాలను సహించేవాళ్ళవుతారు. ఇప్పుడు ప్రపంచంలోకల్లా యెక్కువ పాపిష్టిజాతి హిందూజాతియే. నాలుగైదు శతాబ్దాలనుంచి దీనికి పతనంమీద పతనం కలుగుతూంది. అది హీనస్థితిలోకి పోతూంది–పోతూంది–పోతూంది. విదేశీయులు, విజాతీయులు– అపవిత్రాలయిన నరకంలోని పురుగులు– శతాబ్దాలనుంచి మన తల్లులను, చెల్లెళ్ళను, కుమార్తెలను, కోడళ్ళను అడుగడుగున అవమాన పరుస్తున్నారు. అపహరించుక పోతున్నారు. వారి పైశాచిక అత్యాచారాలను జరుపుతున్నారు. మరి మనం గొప్ప గొప్ప మాయావులైన నాయకుల మాటల్లో చెపున్నా – యెవరి రక్తనాళాల్లో రాముడు, కృష్ణుడు, పరశురాముడు, ప్రతాప్, శివాజీ, గురుగోవింద్, ఇంద్ర,

వరుణ, కుబేరుడు వీళ్ళ రక్తం ప్రవహిస్తోందో, వారీ అత్యాచారాల్ని చూస్తున్నారు. సిగ్గు లేనివాళ్ళవలె చూస్తున్నారు. నీచులవలె చూస్తున్నారు. మగతనం లేని వారిలా చూస్తున్నారు.

ఆగు! చూడు, మళ్ళీ గల్లంతౌతూవుంది. బహుశా వాళ్ళు మళ్ళీ ముట్టడించటానికి వచ్చి వుండొచ్చును. అయ్యో! చాల బలహీనంగావుంది. ఇంకా కొంత వ్రాయవలసిన ముఖ్యవిషయా లున్నాయి. ఈ గల్లంతులో రెండో జాబు వ్రాయటానికి బ్రతికుంటానో లేదో యెవరికి తెలుసు!

ఇప్పటి కంతా వెళ్ళిపోయినారు. రెండు మూడు వందలకంటె తక్కువ లేరు. ఈమూరు ఓ క్రొత్త గుర్తుంచుకోతగ్గ విషయమైంది. వెనుకటిజాబులో యెవని పరిచయాన్ని మీకు కల్గించానో అతడే యీ దళానికి నాయకుడు. వాని పేరు యాకూబ్. అతను మా కాలేజి బి. ఏ., విద్యార్థని వెనుక వ్రాసేవున్నా. అతడుకూడ ఆ ముస్లింకన్యను ప్రేమిస్తున్నాడని కూడ వ్రాశాను. నర్గిస్‌తో వుత్తరప్రత్యుత్తరాలు జరిపే సందర్భంలో నన్ను రెండుమూడుమారులు చూచాయగా హెచ్చరిక కూడ చేసివున్నాడు. ఓమారు నవ్వుతూ నవ్వుతూ స్పష్టముగా జెప్పేశాడు. "చూడండి. తమ యీ ప్రేమ మత బురఖా తగిలించుకొన్నదా, భయానకం గూడా కాగలదు." ఆ సమయంలో నేను క్షుభితుణ్నయికూడ ఆ మాటలనే లెక్కించలేను. కాని నేడతడు భయంకర

రూపం దాల్చివచ్చాడు. చేతిలో కత్తిపట్టుకుని లుంగీ ధరించి రెండుమూడువందల ధర్మాంధులైన వీధుల తిరిగే ధూర్తులను వెంటేసుకుని హాస్టలుగేటుదగ్గరకు వచ్చాడు. అతడు మొదట అరిచేడు—

"మురారీ కృష్ణా! ఓయ్ పర్దాలోవుండే ప్రేమికుడా! కొంచెం ముసుగు వెలుపల ముఖం చూపించు!"

నేను కిటికీలోని అద్దాలగుండా బయటికి తొంగి చూశా. చివరకు నా స్నేహితుడే. నా సహకారే. చాలా ధైర్యమొచ్చింది నేను పిలిచా —

"భాయీ, యాకూబ్! ఇదంతా యేమిటోయ్? అదో చూడు. వారి నెందు కడ్డగించవు? ఈ విధంగా రాళ్లు, సోడాసీసాలు విసిరితే నీతో నే నెలా మాట్లాడడం?"

అత డన్నాడు – "ఇవ్వాళ నీతో కాదు, నీ ప్రాణంతో మాట్లాడ్తా. నీవు "పిరికిపందవు." బిలంలోంచి బయటికి రానేరావు. నీవు కాఫిరువు. మా ముస్లిం తల్లి మాకు త్రాగించిన పౌరుషంకలిగించే పాలు – నీతల్లి నీకు త్రాగించలేదు, విను. ఇక నేను నీ ప్రియురాలు నర్గిస్‌ను ఆమె ఇంటినుంచి బలవంతంగా యెత్తుక పోతాను. ఈసమయంలో నావెంట, నూర్లేమి, వేలకొలది మనుష్యు లున్నారు. ఏ మసీదుకైనా తీసికెళ్లి, రేపు బలవంతంగా ఆమెను నా బీబీగా లేక దాసీగా చేసుకుంటా. ముద్దెట్టుకుంటా, కౌగిలించుకొంటా... ...

"ఆగు! అదిగో......కాఫిర్ల గుంపు ఆవీధినుంచి వస్తోంది. నే నీ సమయంలో వారి నెదిరించ దలచుకోను, తొలగిపోతున్నా. ఇటుచూడు. తీసికో ఈ వుత్తరం నీ కిచ్చిపోతున్నా. ఇస్లాంకు కళంకం కలిగించే ఆధూర్త బాలిక వ్రాసింది. ఆమె నీ దగ్గరకు పంపించింది. కాని నేను నా వేగులవాని ద్వారా దారిలోనే చేజిక్కించుకొన్నా. ఆమెతండ్రికూడా పిచ్చివాడై తన కూతురు పాతాన్నే తాను చదువుతున్నాడు. కాని నష్ట మేమీ లేదు. నేను రే పంతా సరిచేస్తా.

"నీకు పరిచితి చేయడానికే వచ్చాను. నీకు తెలుపడానికే వచ్చివున్నా. నీవు నీ బీబీ అని యెవర్ని తలుస్తున్నావో ఆమెను రేపు నేను నా వశం చేసుకుంటా. రాగల్గితే న న్నెదురుకో. ఆమె పెదవుల్ని నా పెదవుల రాపిడినుండి, ఆమె వక్షాన్ని నా వక్షపు బిగింపునుండి రక్షించుకో."

అతడు యింతా చెప్పి తన దళంతో కూడా సాగిపోయాడు. ఒక విప్పిన కవరు మూసిన గేటుగుండా లోపల పడవేసిపోయాడు. వా రి వెనుకనే మా అదృష్టం వల్ల హిందువుల గొప్పదళం వచ్చింది. దానినాయకుడు మాస్థితి చూచి చాల దుఃఖించి ఈ భవనాన్ని విడిచి మావెంట సురక్షితస్థానానికి రావలసిందని మాతో చెప్పారు. నా స్నేహితులు సిద్ధపడ్తావున్నారు. నేను యీ వుత్తరం వ్రాస్తూన్నాను. అమ్మా! యాకూబ్ పారవేసిపోయిన కవరు తెప్పించుకుని నేను చదివాను,

ఇంతకుముందు జాబులో యెవర్నిగూర్చి నీకు నేను హృదయంవిప్పి ఓ అణుమాత్రమైనా విడువకుండా అన్ని సంగతులూ తెలిపివున్నానో అది ఆమెజాబు. ఆమె నా భార్య అయిపోయింది. నే నామె భర్త నైపోయాను. ఈ సమయంలో యాకూబ్ తప్పక ఆమెను అవమాన పరుస్తాడు. ముసల్మానులు వుద్రేకులైతే వారు చేయం దేమీా వుండదు.

ముస్లిం వంటమనిషి యెదురుగా నిలబడి జాబు పూర్తిచేయమని త్వరపెడ్తున్నాడు. సగానికంటె యెక్కువ విద్యార్థులు తమ సామాను తీసుకొని గేటుదగ్గర నిలబడి వుండే హిందూదళంలో కలిశారు. ఇక నేనుగూడా జాబుపూర్తిచేసి యీా భవనం వెలుపలికి వెళ్తున్నా.

కాని — అమ్మా! నేను రేపు జకరియా స్ట్రీటుకు తప్పక వెళ్తాను. వాడు నాతల్లియైన మీాపాలను నిందించి వున్నాడు. హిందూజాతిని సవాల్ చేశాడు. ఒక హిందు వుయొక్క హృదయ దేవతను భ్రష్టను చేస్తానని బెదరించి యున్నాడు. ప్రాణములు పోయినాకూడా యాకూబ్‌కు ఎదురు నిలబడ్తాను. అమ్మా! ఇది మీాపాలపైనా మతంపైనా చేసిన సవాల్. నా ప్రతిష్ఠపైనా, మానవ త్వంపైనా చేసిన సవాల్ యిది. ఇక్కడ లొంగడం బాగా లేదు. ఈస్థితిలో నేను చచ్చినాకూడా–నేను మీా ముఖాన్ని వుజ్వలవంతంగా, మీా హృదయాన్ని గద్గది తంగా చేయగలను.

ఏడ్వవద్దు. వ్యాకుల పడవద్దు. మరి యిక్కడకు రానుకూడా వద్దు. నేను చచ్చిపోతానని మీరనుకోవద్దు. చావడం యేమీ ఆటకాదు. కొంచెం శాంతించగానే జాబు వ్రాస్తా - తంతి యిస్తా.

ఇప్పటికి ఇది చాలు.

మీ
చిన్న బాయి.

# 7

(అ ద్ర కు)

శ్రీమాన్ 'ప్రతాప' - సంపాదక.
Prathapa Press
Cawnpore.

బడాబజారు
కలకత్తా
8-4-1926.

సంపాదక మహాశయా,

నిన్నటినుండి కలకత్తాకు వచ్చివున్నాను. నేను కాన్పూరు విడవటానికి ముందు తమరు చెప్పిన విషయాన్ని నేను మర్చిపోలేదు. తమరు "అచ్చట చేరగానే వీలైనంత త్వరలో కలకత్తా అల్లరుల గురించి విస్తృతంగా నిజమైన విషయాలు పంపవలయును" అని చెప్పారు ఒక సుందర సజీవ మోహాంధకార మిత్రునితో చాలా సంవత్సరాల తర్వాత కల్సుకోడానికి పోతున్నానని నే నప్పుడే మనవి చేసుకొన్నా. "సైంటిఫిక్

పర్సెంట్" ఓ అద్వితీయ జాతీయకార్యం చేయడం కోసం పోతున్నా. అనగా ఓ హిందూ యువకుడు, బ్రాహ్మణుడు, మిత్రుడు, బంధువు, ప్రియతముడు, అభిన్నహృదయుడైనవానికి సలహా యిచ్చుటకుగా — యెవరి అందమైనచిత్రం ఆయనన్నేత్రాల్లో దినరాత్రులు, రాత్రిందివములు మెదుల్తూవుందో ఆమెను, ఆత్మ చెప్పినట్లయితే పవిత్ర అంతర్వాణి ఒప్పుకున్నట్లయితే ఆయన ఆ "యవన నవనీత కోమలాంగిని" పెండ్లి చేసుకోమని. తమరు నామాట విని కళ్ళజోడు తుడుచుకుంటూ బిగ్గరగా నవ్వి ఇలా అన్నారు— "గోవిందజీ, మీరుగూడా కూర్చునే యేదో వొక స్వప్నాన్ని యెప్పుడూ కంటూనే వుంటారు ఈవిధంగా హిందూ ముస్లిం ఒక టని తారుమారుచేసే మీ మిత్రుడెక్క డుండేవాడు? ఆయన కుల మేమిటి?" నేను చెప్పా- "ఆయన ప్రయాగలోని ఒక ప్రసిద్ధ బ్రాహ్మణమాన్య పురుషుని కొడుకు" ఆయన జవాబిచ్చాడు— "అయితే అయిపోయింది!- అయితే అయిపోయింది! ఈ ఆకాశం భూమితో కలపబడదు" నేనన్నా—దీంట్లో నాకేమి యిబ్బంది కనబడడం లేదు. స్త్రీ లెప్పుడూ రత్నాల మాదిరి పవిత్రంగా వుంటారు. మనసు కలిసినట్లయితే యేజాతిలోని స్త్రీలైనాగాని, ఏ జాతిలోని పురుషులైనా గాని ప్రసన్నతాపూర్వకంగా వివాహం చేసుకోవాలి. ఇదే మన ఆర్యుల సనాతనధర్మం. ఈ విషయంలో అధికంగా తర్కించేట్లయితే పురాణాల్నుంచే అనేక

ప్రమాణాలు చూపిస్తా. వాటిలో దీన్ని ఋజువుపర్చే అనేకకథ లున్నాయ్. ఆకాలంలో ఋషులు, రాజులు కోరిక కల్గితే ఏజాతిస్త్రీనైనాసరే వివాహంచేసుకుంటూ వుండేవారు. మహాభారతంలోని అర్జునుడు, భీముడు, నాగ, రాక్షసకులాలలోని కన్యలనుకూడ విడిచిపెట్టలేదు. వారిని విడిచిపెట్టండి. నిన్న మొన్నటి విషయం, ప్రచండ సంస్కృత విద్వాంసుడు మహాకవి పండితరాజ జగన్నాథుడు రొమ్ముదట్టి ముస్లింయువతిని తన అర్ధాంగిగా చేసుకున్నాడు. అది పోనీయండి. వర్ధమాన హిందూసమాజాన్ని తీసుకుందాం. మతం–మతం, ఆచారం, హిందూ–హిందూ, ముస్లిం–ముస్లిం అని కేక పెట్టేదెవరు? కేవలం దరిద్రులు, కేవలం మూర్ఖులు. ఎవరివద్ద ధనముందో, ఎవరు సరస్వతిని తన దాసీగా చేసుకున్నారో, ఎవరు బలవంతులో ఎవరు ఏమీ అడుగరు. ఫలాన ప్రదేశం లోని రాజు దినమంతా సారాయిత్రాగే జీవిస్తున్నాడు. వారికి నీళ్ళు అరగవు. అందువల్లే శుద్ధరజితపాత్రిలో విదేశీవిస్కీ పోసిస్తున్నారు. ఇంతేకాదు. వారు పంచ "మకారా"లకుకూడా అలవాటు పడ్డారు. తన జమీన్ లోని యువతులను ప్రతిదినం ఏదో ఒక మోసం, ఏదో ఒక మతం పేరిట ధర్మకార్యాల్లో భ్రష్టలగా జేస్తున్నాడు. ఆయనకు వేలకొలది వుపపత్నులు, లంజెలు వున్నారు. వారిలో చాలామంది హిందువులు, ముసల్మానులు, కొద్దిగా తెల్లదొరసానులుకూడా వున్నారు. ఇంత జరుగుతున్నాకూడా వారు మన వ్యవస్థాపకుల దృష్టిలో ద్విజో

త్తములు. సనాతన ధర్మానికి మకుటాలు. గొప్పగొప్ప పురాణ రక్షకములైన సనాతన ధర్మసభలకు అధ్యక్షులు ఏమైనారు—ఏమైనారు. అది ఎందువల్లనంటే సంఘంలో ధనం కలవాడు బహిరంగంగా ముస్లింవేశ్యల నుంచు కొంటున్నాడు. కాని సంఘం వాణ్ని క్షమిస్తోంది. క్షమించడమేకాదు! దురాచారులు, వేశ్యాలంపటులు అయిన ధనవంతులను అత్యాకాంక్షతో లాలసామయదృష్టితో చూస్తుందికూడానుమరి. అయ్యా, తెలుపండి, ఈ ఆకాశం భూమితో ఏల కలుపబడడంలేదు? ముస్లింవేశ్యల ప్రవేశంతో సనాతనధర్మపవిత్రవేదిక అపవిత్రమూ నష్టమూయిందిగా కాకపోయినట్లయితే ముస్లింకన్యలప్రవేశంతోనెలా భ్రష్టమైపోతుందండి?" నామాట విని తమరన్నారు - "మంచిదండీ, ఇప్పట్నుంచీ నన్నెందుకీజగంలోకి లాగుతారండీ. మొదట అక్కడకు వెళ్లి వీరా స్నేహితుణ్ణి అతని పరిస్థితుల్ని చూచుకోండి. మరి అర్థంచేసుకోండి గూడా. కాని నామాట మరవకండి. అచ్చటి సమాచారాలు వెంటనే వ్రాయండి. నాకేం విశేషమైన ఇబ్బంది లేదు. తమ మిత్రుడు సంతోషంగా ఆయువతిని పెండ్లాడుగాక! మనకు మన పాఠకుల మనోరంజనార్థం ఓ సుందర సమాచారం దొరుకుతుంది. హహహహహా!"

సంపాదక మహాశయా! తమరు మనసులో విసుక్కుంటూ కోప్పడ్తూవుండొచ్చు, ఇలా అనుకొంటూ - "ఈ మూఢుడు వేయిమైళ్ల దూరంనుంచి నామాటల్నే నావద్దకు ఎందుకు వ్రాసిపంపుతున్నాడు? నేనేమో

అచ్చటి అల్లరుల సంగతులు వ్రాయమని చెప్పానుగదా."
నిజంగా ఈసమయంలో ఏం చేయడానికి తోచని మూఢుడుగానున్నా— తెలితక్కువవాడినై పోయా - కాన్పూరులోని తమ —నామాటలు మరల ఓసారి వ్రాసిన అభిప్రాయ మేమిటంటే - నేను యేప్రేమ మయ కార్యంకోసం వచ్చానో దాన్ని మరొకసారి తమకు జ్ఞాపకంచేయడానికే. కాని దుఃఖం. ఇక్కడికి రాగానే నా కోరికలన్నీ మట్టిలో గలిసిపోయినై. ఇప్పుడు నాకు నాలుగువైపులా అంధకారమయంగానే వుంది. నేను యీ జాబువ్రాసి నన్ను మీరు క్షమించాలెనని ప్రార్థిస్తున్నా. నా కవకాశం సౌభ్యం వుండి నప్పటికీకూడ తమ పత్రికకు అచ్చటి సంఘటనల రిపోర్టు పంపలేను. నా బుద్ధి సరిగాలేదు.

ఈ కారణం తెలపడానికి కలకత్తాలోని నా రోజున్నర దినచర్య తమయెదుట వుంచవలసివుంది.

7 ఏప్రిల్ ఉదయం 6½ గం॥లకు ఆనంద, భయాలతో గూడిన అనేకభావాలు హృదయంలో పెట్టుకొని హౌరాస్టేషనుకు జేరాను. చాల సంవత్సరాల తర్వాత నా అభిన్నహృదయుని దర్శనంచేస్తాననే ఆనందం, కలకత్తాలోని అల్లరుల గాలికబుర్లవల్ల భయం. రైల్లోనే ప్రయాణీకులు జాగ్రత్తపడటం చూచాను. కలకత్తాలోని హిందూ మహమ్మదీయ కలహాలవల్ల హిందూ మహమ్మదీయుల భావాలు కలకత్తాబోయే రైళ్ళలో హత్యలు జరిపేంత భయంకరంగా వున్నాయని ప్రయాణీకులు గుస

గుసలాడుతూవున్నారు. నేను స్వయంగా చూడలేదు. కాని స్టేషను బయటకురాగానే ఒక గుజరాతీ హిందువు నా చెవిలో యిలాచెప్పాడు.— "యీ బండిలోనే రెండు మూడుశవాలు దొరికినై. చాల దుఃఖకరమైన విషయం. మనమైతే బ్రతికాం." నేను నవ్వి జవాబిచ్చా "భాయిజీ! మన మెలా బ్రతికాం? కలకత్తాఅంతా మన యెదురే వుంది. దీంట్లో బ్రతికితే అంతటా బ్రతికినవాళ్ళమే!" బడా బజారులోని నె......రు యింట్లో నా మార్వాడీ మిత్రునివద్దకు చేరి అక్కడినుంచి మురారిని కలిసికోవ టానికి హాస్టలుకు వెడదామని మొదటే ఆలోచించుకొని వున్నా. ఇదే చేశానుకూడ. ఓ టాక్సీలో కూర్చొని యిలా అన్నా.

"బడాబజారు జేరుస్తారా?"

"చేరుస్తాం. కాని తమ రెవరు?"

"హిందువును, బ్రాహ్మణుణ్ణి, మానవుణ్ణి."

సిక్కు నవ్వాడు—"బాబూజీ! కోప్పడ వద్దండి. ఇప్పట్లో యిక్కడ ముస్లిం వెధవలు అత్యాచారాలు చేస్తున్నారు. వారు అందర్నీ మోసంచేస్తున్నారు. హిందు వుల్ని తంటాలు పెడ్తున్నారు. అందుచేత మేము బాగా పరీక్షించి హిందువుల్నే యెక్కించుకొంటున్నాం."

నే వడిగా "త్రోవలో యేమీ అపాయం లేదుగదా?"

డ్రైవరన్నాడు "ఇటుచూడండీ! మే మిద్దరం అన్నదమ్ములం. ఇద్దరం రెండు ఖడ్గాలు తీసుకొని తమ

వెంట మోటారులో వస్తున్నాం. దారిలో యేదైన అపాయం గలిగితే మొదట మాకు, తరువాత తమకు. మేము బ్రతికుండగా మీవేపు యెవడూ తలెత్తి చూడ నైనా చూడలేడు. కాని బాబుజీ, బండి కదిలేదానికి ముందు మీ పిలక, జందెంచూచుకొని మరీనడుపు తాం."

నా కేమీ ఆటంకం తోచలేదు. నేను సంతో షంగా నాపొడుగాటి పిలకనీ, లావుజందాన్నీ వారికి చూపించాను. వారు నమస్కరించుకొని బొంబొమ్మని కదిలించారు. హారావంతెనదాటినమీద నాలుగైదు ఫర్లాంగులు ముందుకు పోవలసివుంది. మొత్తం నాలు గైదు నిమిషాల ప్రయాణం. ఇంతటిలోనే అల్లరులవల్ల కలకత్తా యెలావుంటున్నదీ తెలుసుకొన్నాం. నిశ్శబ్దం - మౌనం-భయంకరం - రెండు, మూడు చోట్ల బల్లపరుపు మీద సిక్కులు రక్తపు చిహ్నాలు చూపించారు. — "ఇక్కడ కత్తులారిసినయ్. ఇక్కడ రక్తపాతముయింది బాబూ!" మార్వాడీ మిత్రునింటికి చేరగానే యిప్పుడు శాంతిస్తుందని తెలిసింది. ఒక వారంరోజులు భయానక రక్తపాతములు చూపించినమీద యిప్పుడు ముస్లిం గుండాలు కొంచెం సేదదీర్చుకొంటున్నారు. మురారి, అతని హాస్టలు విషయం అడిగినమీద పై మార్వాడీ సజ్జను డన్నాడు— "ఆ హాస్టలువాళ్ళు చాల చిక్కులో పడివున్నారు. దాన్ని ముస్లింలు అనేకసార్లు ముట్టడిం చారు. అందులోని విద్యార్థులు మూడు - మూడు

దినాలవరకూ కేవలం నీళ్ళుమాత్రం త్రాగివున్నారు. ఇదిగో నిన్ననే మా హింసూదళం వారిని అక్కడనుంచి బయటకు తీసుకువచ్చింది

నేను ఉత్సుకుడనై అడిగా "వారు అక్కడనుంచి వచ్చి యెక్కడికి వెళ్ళారు?"

మిత్రుడన్నాడు:- "కొందరు హాస్పిటలుకు, కొందరు తమతమ స్నేహితుల యిండ్లకు, కొందరు వారిష్టమొచ్చినచోటికి."

నేను భయపడి అడిగా "మరి మురారి? అత నెక్కడి కెళ్లాడు?"

"ఎవడు మురారి? తమరెవర్ని అడుగుతున్నారు?"

ఆ మార్వాడీసజ్జనుడు నాకు పరిచితుడే గాని మురారికి కాదు. నా కాయన మాటలవల్ల చాల నిరాశ గలిగింది. నేను మనస్సులోనే చాలా గాబరాపడిన ట్లయిపోయాను. నే నాలోచించసాగాను. ఇక నతనికోసం యెక్కడ వెదకటం? ఈ సమయంలో కలకత్తాలో యెవరినైనా వెదకి కనుక్కోవాలంటే అదేమీ తేలికైన సంగతి కాదు. నేను గడియారంచూచా, ఎనిమిదింబావు అయింది.

"తమ మోటారు ఖాళీగా వుందా?" అని మార్వాడీ మిత్రు ణ్ణడిగా. "మోటారు ఖాళీగావుంది. వాషాఫరుకూడా ఖాళీగా వున్నాడు. మరి (తనవేపు చూపిస్తూ) తమ యీ నౌఖరుకూడా పూర్తిగా ఖాళీగా

వున్నాడు. కాని మొదట తమరు స్నానంచేసి కొంచెం భోజనం చేయండి.

స్నానం, భోజనాలకు మనస్సు పోలేదు. కాని మర్యాదకోసం లోకాచారాన్ని పాటించవలసివచ్చింది. ఇదంతా చేస్తూ, చేయిస్తూ పూర్తిగా పన్నెండు ఘంట లయింది.

7 వ ఏప్రిల్ మధ్యాహ్నమయింది. నేను సేఠ్ గారితో చెప్పా, "సేఠ్ గారూ ఇకనైతే నేను నా సోదరుని వెతకేందుకు తప్పకపోతే" అని. వారన్నారు—సంతోషంగా యీ సేవకుడు కూడా తమ వెంట వస్తాడు."అరే-ఓ మోటారు సిద్ధం చేయించు" సేఠ్ గారు వుడుపులు ధరిస్తుండగానే ఆయన దృఢకాయుడైన సిఖ్ఖుజమాదారొకడు వచ్చి చెప్పాడు— "బాబుగారూ యిప్పుడిప్పుడే ఓ హిందూయువకుడు చంపబడ్డాడు !"

"ఎక్కడ ? ఎక్కడ?" మేమిద్దరం ఒకేసారి ఒకే స్వరంలో ఆ సంగతి చెప్పినవాణ్ణడిగాము.

వాడు గంభీరుడై జవాబిచ్చాడు – "జకరియా స్ట్రీట్‌లో."

సేఠ్ అడిగారు: అక్కడికి హిందు వెందుకు పోయాడు ? ఎలా వెళ్ళాడు ? అది ముస్లింల స్థానమే ! ఆ హిందు వెవడు ? ఏమైనా తెలిసిందా ?"

"ఎవరో అదేమో చెప్పలేం. ఆ చెప్పేవాళ్ళు,అతడొక సుందరపురుషు డన్నారు. ఉఫ్, బాబుగారూ !

ఆ దుర్మార్గులు అతనిని ముక్కలుముక్కలుగా చేశారని తెలుస్తోంది.''

సంపాదక మహాశయా! ఈ జకరియా స్ట్రీటు గూండాలస్థానమేమో నాకు తెలియదు. ఇంతకుముందు దీని పేరుకూడా నేను వినలేదు. కాని ఓ ముస్లింపేటలో ఓ సుందర హిందూ యువకుని హత్య విని నా రక్తం యింకిపోయింది. నా మనస్సులో గడబిడ యెందుకు జరుగుతుందో తెలియడంలేదు. కళ్లు చీకట్లు క్రమ్మినై. నేను సేట్‌గారితో అన్నా- "జకరియా స్ట్రీట్ యెక్కడున్నది?"

"కొంచెందూరంలోనే - ఎందుకు? జకరియా స్ట్రీటుకు వెళ్తారా? ఇప్పుడిప్పుడే ఓ హత్య జరిగిందని విన్న యీస్థితిలో?"

"ఔను"

"ఎందుకు?"

"చెప్పలేను యెందుకో? కాని నేను నా సోదరుణ్ని వెదకాల్సివుంది."

"సరే పదండి—సరే, గాభరాపడొద్దు, పదండి. పోలీసు స్టేషన్నుంచి కొంతమంది పోలీసుల్ని తోడు తీసుకుందాం."

బడాబజారు పోలీసుస్టేషన్ అధికారికి కథంతా వినిపించి మా సహాయంకోసం ఐదుగురు సిపాయిల్ని అడిగాను. ఆయన చెప్పారు - "కొంచెంసేపటికి ముందే జకరియాస్ట్రీటులో యెవడో హిందువు చంపబడ్డాడని

కబురొచ్చింది. ఒక పోలీసుదళం అక్కడికి వెళ్ళివుంది. మరి తమరుకూడా సంతోషంగా ఐదుగురు సిపాయిలను తమ మోటారులో యెక్కించుకొని తీసుకువెళ్ళండి."

స్టేషను అధికారికిధన్యవాదా లర్పించి సిపాయిలను మోటారు యెక్కించుకొని జకరియాస్ట్రీటువేపు వెళ్ళాం.

జకరియాస్ట్రీటు ప్రవేశించగానే మా దృష్టి ఆపోలీసుదళంమీద పడింది. మామోటారుకు ఓ వంద గజాల దూరంలో ఒకమోటారులారీని చుట్టుకుని 20, 30 మంది పోలీసులు, చాలమంది సార్జెంటులు అనేకమంది యితరజనం వసున్నారు. మోటారును మెల్లగా పోనీమని డ్రైవరుతో చెప్పాం. నాగొంతు యెండిపోసాగింది. నాగుండె పైకి లాగినట్లైంది. ఆమో టారులో యేముంది? ఎవడున్నాడు? దానిలో అపురూప సుందరుని శవాన్ని వేసి పోలీసులు తీసుకుపోతున్నారా? ఔను అది అంబ్యులెన్సు కారే. అరే! సేఠ్ గారూ, సేఠ్ గారూ! అటుచూడండి – ఆమె, ఆసుందరి యెవరు? అదిగో చూడండి – చూచారా! అపూర్వసౌందర్యం, సాటిలేని యౌవ్వనం.

ఆ స్త్రీని చూచి నా మార్వాడీమిత్రుడుకూడా కొంచెం తికమక జెందాడు. "పండితజీ, తమ రామెను గుర్తిస్తున్నారా? ఆమెరూపం సరిగా తమరిమాదిరే వుంది."

"నారూపంలాంటి రూపం! ఆఁ!" నాకు ప్రియతమ మురారిజాబులోని ఆమాటలు జ్ఞాపకము వచ్చినై. 'నీకళ్ళ

లాటికళ్ళు, నీ సుందరమైనముఖంలాటి ముఖం, నీ చిరునవ్వులాంటి మనోమోహన మందహాసం, నీ ముక్కులాంటి ముక్కు, నీ పెదవుల్లాటి పెదవులు - ఆ నారూపం లాంటి రూపం, ఐతే యేం... అయితే యేం?'

నేను మోటారులో కూచున్నానని మర్చిపోయాను. మృత్యురంగమైన కలకత్తాలో, కలకత్తాలోని నరకలోక జకరియాస్ట్రీట్లో వున్నా ననే సంగతి మర్చిపోయా. నా వెంట నల్గురు పెద్దమనుష్యు లున్నారనే సంగతికూడా మర్చిపోయా. తలుపు తెరవకుండానే మోటారునుండి వెలుపలికి రోడ్డుమీదికి దూకా. మోకాలు పగిలినప్పుడు స్మృతి వచ్చింది. రక్తం కారుతోంది. కాని ఆ స్మృతి కూడా క్షణికమే. శరీరానికి దెబ్బ తగిలింది. ఆ దెబ్బ యొక్క అనుభవమే స్మృతిరూపాన్ని దాల్చింది. మోకాళ్ళు తీవ్రంగా పగిలినా యని నాకు తెలిసింది. కాని మోకాళ్ళ వేపు చూసే దెవడు? నాకేమో మోటారులోని శవాన్ని చూడవలసివుంది. మోటారు వెలుపలి సుశీల, సుందరి పరిచయం కావలసివుంది. ఎదురుగా వస్తుండే సర్కారు శవయాత్రవేపు పరుగెత్తా. ఆ దళం యొక్క సార్జెంటు నన్ను వుపద్రవకారు డని తలచి నావేపు యెంతవరకూ తుపాకుల్ని గురిపెట్టి చూపలేదో, డాక్టరు ఆగుమని కేకవేయలేదో అంతవరకూ పరుగెత్తుతూనే వున్నా.

"న న్నడ్డగించవద్దు, న నడ్డగించవద్దు!"

రెండు తుపాకులు నా గుండెకు కుడి, యెడమ వైపుల ఆనించి నిలబడిన్నై. ఓ సార్జెంటు తీక్షణస్వరంతో నాకు స్వాగత మిచ్చాడు.

"ఎక్కడికి పోతావ్?"

"నేను చూస్తాను - స్పష్టంగా చూస్తాను."

"ఏం చూస్తావ్?"

"బండిలోప లున్నవాణ్ని."

ఈ లోపల సేఠ్ గారి మోటారుగూడ వచ్చింది. ఆ దళంలోనివారు చాలామంది సేఠ్ గార్ని గుర్తించారు. ఆయన సార్జెంటుకు తెలిపారు. కాని యీ విషయాలు నాకు తర్వాత తెలిశాయ్! ఆ సమయందాటితే అందర్నీ నెట్టుకుని అంబ్యులెన్సుకారుదగ్గరకు దారిచేసుకోడమే నా ధ్యానంలో వుంది! నే నెగిరి అంబ్యులెన్సుకారులో యెక్కాను. ఓ క్షణంలోనే మొదటి దృష్టిలోనే 'అతని లాంటి' ఆకారంగల శవాన్ని గుడ్డతో కప్పి స్ట్రెచర్ మీద వుంచినదానిని చూచాను. నాల్గువేపులా రక్తపు కాల్వలు పారుతున్నయ్.

ఆ ముఖం గుడ్డతో కప్పివుంది. నేను తొలగించాను. ఆ ముఖం భయంకర శస్త్రాల క్రూర అఘాతాలతో నిండివుంది. ఆ ముఖం అగణిత రక్తధారల్తో నిండివుంది. నిర్జీవమైనా ఆ ముఖం, గౌరవ ప్రసన్నతా, వీర, ప్రేమలతో కూడుకొనియున్నది. ఆ ప్రియమైన ఆ సుందరవదనం అనేక విధాలుగా వికృతమై వుండినాకూడా నేను గుర్తించాను. అయ్యో! వెంటనే జీవిత వృషః

కాలంలో దేన్ని నేను అతృప్తనేత్రాలతో కళ్ళు పెక లించుకొని చూస్తూవున్నానో, ఇది అదే ముఖం. ఏది యెదురుగా కనబడగానే యెండిపోయిన నా హృదయ కళిక పచ్చనై, వికసిస్తూ వుండేదో అదే యీ ముఖం. దేని దర్శనమాత్రంచేతనే నా అంతస్థల సర్వ ప్రవాహా ముప్పొంగుతూ వచ్చేదో అదే యీ ముఖం. దేని సౌందర్యంయెదుట తులసీదాసుని 'కోటిమనోజలజా వణ హారే' (కోటి మన్మథుల సిగ్గుపరచునట్టివాని) సౌంద ర్యాన్ని కూడా లెక్కించకుండా వున్నానో అదే యీ ముఖం. ఏది నాకు స్వర్గంగా, మోక్షంగా, సంతో షంగా, ఆదర్శంగా, కళ్యాణకరంగా, ప్రాణంగా వుంటూ వుందో అదే యీ ముఖం - అదే యీ ముఖం!

నా హృదయానికి హృదయం, ప్రాణానికి ప్రాణం అయిన ఇతని స్థితి చూచేప్పటికి నిశ్చేష్టుణ్ణయాను. నా తెలివి నశించిపోయింది. ఇప్పు డేంచేయాలో, ఏం చేయ కుండా వుండాలో అనే జ్ఞానమే లేకుండా పోయింది. హృదయంలో ఒకేసారి అనేక భావాల భయంకర తుపాను చెలరేగింది. ఒకప్పుడు కోపమొస్తూ వచ్చింది. ప్రియతముని హంతకులపై - కల్లోలితసముద్రంవలె - ప్రజ్వలిత బడబాగ్నివలె, నిప్పులు గ్రక్కే అగ్ని పర్వతంవలె - ఒకప్పుడు కరుణ కల్గుతూ వచ్చింది. ప్రియతముని ఆ స్థితిపై - వితంతుహృదయంవలె, తల్లి విలాపంవలె, రామహీన దశరథునివలె ఆ అంబ్యులెన్సు కారులో ప్రియతమశవంవద్ద మోకరించి చైతన్యరహి

తునివలె యెంతసేపు కూచున్నానో నాకే తెలియదు. ఏశ్వాసం లేదూ, నవ్వుడం లేదూ; వణకడం లేదూ, కదలడం లేదు.

ఎవడో నాచేయి పట్టుకొన్నాడు. "క్రిందికి దిగండీ. మేము ఠాణాకు పోవాలి. ఎంతసేపని ఇక్కడ ఆగివుంటాం? ఆలస్య మౌతోంది."

నేను మౌనంగా, ఒక నిట్టూర్పు విడిచి, క్రిందికి దిగివచ్చాను. ప్రపంచంలో ప్రియతమ మురారీశవము, నాసంతప్త హృదయం - ఇవేగాక, ఇంకా కొన్ని వస్తువు లున్నవనే జ్ఞానం నా కాసమయంలో కలిగింది. అన్నిటి కంటే ముందు నాదృష్టి శోకవజ్రాహత నర్గిస్ పై బడింది. ఆమె కళ్ళు ఎఱ్ఱగా, కపోలాలు పసుపుపచ్చగా, పెదవులు తెల్లగా వున్నయ్. చెదరిన వెంట్రుకలు, అస్తవ్యస్తంగా గుడ్డలు గల ఆ అభాగిని పూర్తిగా శూన్యంగా నిలబడి వుంది. నేను నిశ్శబ్దంగా ఆమె కెదురుగా వెళ్ళిపోయా - "సోదరీ!"

ఒక ముసలి మహమ్మదీయుడు నా కెదురుగా వచ్చి కళ్ళనిండా నీళ్ళుపెట్టుకుని నాతో చెప్పాడు- "బిడ్డా! దేవునికిగా యీసమయంలో క్షమించు, నా దురదృష్ట కుమార్తె యీసంఘటనవల్ల యేమై పోయిందో యే మెరుగుదుం! ఆపద విరుచుకు పడింది, భయ్యా! నా యీ బలహీనుని తలపై విరుచుకు పడింది."

"ఆయ నెలా చంపబడ్డాడు! ఇదే అడుగుతున్నావు గదా!" నర్గిస్ నావేపు చూస్తూ చెప్పింది. "తెలుప్ప

తున్నా. ఇప్పు డేడ్చి యేడ్చి గుండెలు బాదుకొని బాదుకొని అలసిపోయివున్నా. ఆ నేత్రాలకు కన్నీళ్ళు తయారుచేయ డానికీ, ఇవ్వడానికి, నా హృదయధనాగారంలో ఏమీ మిగులలేదు. నీళ్ళూ లేవు. రక్తమూ లేదు. ఇక చెప్ప గలను. వినండి—ఆయన శవంలానూ కాదు, పిరికిపంద లానూ కాదు. సింహంలా, వీరుడిలా చంపబడ్డారు. వారి వద్ద పిడిబాకువున్నది. వారి చేతిలో పెద్దకర్ర వున్నది. కాని ఆ నరకలోకపు కుక్క, ఆ ఇస్లాంమత కళంకి, ఆ యాకూబ్ 50 మంది దుర్మార్గులతో నుండకపోయి వుంటే నిమిషంలోనే చచ్చివుండేవాడు. ఆయన యెప్పటి నుంచో, యెంత దూరాన్నుంచో వారితో పోరాడ్తూ రక్షించుకొంటూ, నా దర్వాజావద్దకు వచ్చారో తెలి యదు. గట్టిగా కేకవేశారు— 'నర్గిస్! నేను వచ్చేశాను.' వారి ధ్వనినిగా గల్లంతును విని గదిలోని కిటికీగుండా తొంగిచూశాను. చూస్తున్నానుగా. అనేకమంది కసా యిలు ఒక ఆవును మాదిరిగా; అనేకమంది దుర్మార్గులు ఒక మనిషిని అతినికృష్టంగా చంపుతున్నారు. నేను చూస్తూండగానే ఆ బద్మాషులు నా హృదయ పెన్నిధిని ముక్కలు ముక్కలు చేసేశారు. అబ్బా! ఆదృశ్యం యెప్పటికి మరువలేను, ఎప్పటికీ మరువను."

హఠాత్తుగా నర్గిస్ కనుబొమలు ముడివడినై. ఆమె పిచ్చిదానివలె గర్జించి చెప్పింది. "నీవుకూడ పిశా చంలా వున్నావు. నీవుకూడ మహమ్మదీయునిలా కనబడు తున్నావ్. తొలగిపో, తొలగిపో నా యెదుట్నుంచి!

చూడడంలేమూ? నే నొక హిందువుని భార్యను. నా ముఖాన బొట్టువుండడం చూడడంలే? రక్తపు తిలకం! వారిహృదయ రక్తపు సౌభాగ్యం!! చూడ డంలే ?"

ప్రియమైన మురారి వియోగంవల్ల నర్గిస్‌కు కల్గిన అవస్థను చూచి శిలామయంలావుండే నా ప్రాణం కరిగిపోయింది నీరైపోయింది. ఇంతవరకూ నిల్చివున్న కన్నీళ్ళ ప్రవాహం పొంగివచ్చింది. నే నేడ్వసాగా—

"సోదరీ"

"ఇప్పు డేడిస్తే యేమౌతుంది?" నర్గిస్ అన్నది.

"ఇప్పు డేడిస్తే యే మౌతుందా? మీరు మాన వులే? మీరు మానవుల ప్రేమిస్తారా? ఐతే యేడ్వవద్దు. రాండి. నావెంట నడు, నాతోకూడ. మానవరక్తం త్రాగ డం, మానవహత్య చేయడం పుణ్యమని తలచబడే మతంలో ఆ పిశాచ నీచకళంకాన్ని భూమియొక్క చెరగునుంచి తుడిచి నాశనం చేసివేస్తాం. ఇలాంటి పైశా చిక అపవిత్రమతం, నశించిందా అంటే దేవుడు సంతోష పడ్తాడు. ఫరిస్తా ఆనందంతో నాట్యంచేస్తాడు. ఆకాశ మంతా పుష్పవర్షాన్ని కురిపిస్తుంది.

సంపాదక మహాశయా, యిక యెక్కువ వ్రాయ లేను. శక్తిలేదు. హృదయమూ లేదు. ఆ సమయా న్నించే నా పరిచయం పొంది నర్గిస్ నన్ను విడిచిపెట్ట డమే లేదు. ఆమె, ఆమెతండ్రి యిద్దరున్నూ నా మార్వాడీమిత్రుని పవిత్రఅతిథులైనారు. తండ్రి-ఖాక్

బహాదూర్, ధనికుడు, బుద్ధిమంతుడు, వృద్ధుడు — అమ్మాయీ మరచిపో, ఇంటికి పోదాం పద, అని అనేక విధాలుగా ప్రతిమాలుకొంటాడు. కాని కుమార్తె పిచ్చిదిగా, స్మృతిరహితగా అయిపోయింది. ఆమె అయితే ముసల్మానుల నాశనంచేసి మరి వూపిరి పీల్చుకొంటా నంటుంది. ఇస్లాంమతాన్ని రూపుమాపి యింటికి వస్తానంటుంది. ఆమె పోలీసుల్తో, మేజిస్ట్రేటుతో, పోలీసు కమీషనర్తో అందరితో చెప్పేసింది—"నేను విప్లవకారిణిని, చదువుకున్నదాన్ని, అన్నియు తెలిసినదాన్ని, నేను బాగుగా తెలుసుకునే హిందూమతాన్ని స్వీకరించాను. ఇప్పుడు నేను హిందువును.'' ఆమె నా వెంట ప్రయాగ, కాన్పూరు, కాశీ, స్వర్గ, నరకం యెక్కడికైనాపోనీ వచ్చి ముస్లిం ధర్మానికి విరుద్ధంగా ప్రచారంచేయడానికి సిద్ధంగావుంది.

నేనుకూడ ఆమెను విడిచిపెట్టను. ఆమె నా సోదరి. నా ప్రాణముల ప్రియురాలు. ఉస్! సంపాదక మహాశయా! తమ రిచ్చట లేరు. లేకుంటే ఈ అభాగిని నర్గిస్ యొక్క నిరాశసౌందర్యాన్ని చూచివుందురు. ఆమె నా యెదురుగా నేలమీద దుఃఖంగా కూర్చోని మెల్ల మెల్లగా గొనుగుతూ వుంది—

నే నెవ్వరి కన్నుల జ్యోతిని గాను
యెవ్వరి హృదయవికాసము గాను
యెవ్వరి పనికిని అందకబోవన్
నే నొక పిడికిలి ధూళినె యగుదున్

నేనై యెవ్వని శత్రువుగాను
నే నెవ్వరిని చెడువిషయము గాను
చెడినవాని కదృష్టము నగుదుఁ
దీనుల కెల్ల దయార్ద్రను అగుదుఁ
రూపము నాయది వికృతం బయ్యెఁ
కాలము నన్నను విడిచియు చనియెఁ
ఆకురాలుటచే శోభను బాసిన
వనముకు వటవసంతమె నేను.

ఇప్పుడు గొణుగుడు చాలించింది. చింతితముఖముతో మురారితల్లి దర్శన మెప్పుడు చేయిస్తారని నన్నడుగుతూంది.

నేను త్వరలోనే ఇక్కడనుంచి ప్రయాగ వెళ్లి మళ్లీ కాన్పూరు వస్తాను.

ఈ సమయంలో — ఇంతే.

సర్వస్వహీనుడు,
శ్రీ గోవింద హరిశర్మ.

సం పూర్ణం.

—...—

# మా ప్రచురణలు

| | | |
|---|---|---|
| * 1. | రవ్వలు - కథలు (చలసాని రామారాయ్) | 0-8-0 |
| * 2. | దీపావళి ,, ,, | 0-8-0 |
| * 3. | విద్యుల్లత-ఖండకావ్యం (శివరామకృష్ణయ్య) | 0-8-0 |
| * 4. | సోవియట్ వీరవనితలు - అనువాదం (చలసాని నిర్మలకుమారిరాయ్) | 0-6-0 |
| * 5 | జపాను సామ్రాజ్య కాంక్ష | 0-10-0 |
| * 6. | రెండాకులు ఒక మొగ్గ - నవల (ముల్క్‌రాజ్ ఆనంద్) | 3-0-0 |
| 7. | ఫాంటమారా-నవల (ఇగ్నేషియో సైలోన్) | 2-0-0 |
| 8. | చిన్నాజీ-కథలు (చాగంటి సోమయాజులు) | 0-12-0 |
| 9. | స్టాలిన్‌గ్రాడ్ - యుద్ధచరిత్ర | 1-0-0 |
| 10. | నేతాజీ పిలుపు - బోసు ఉపన్యాసాలు | 0-10-0 |
| 11. | గాంధీజం-సోషలిజం (రా. సీ. ఆంజనేయశాస్త్రి) | 1-0-0 |
| 12. | ఇండోనేషియా స్వాతంత్ర్య పోరాటం (శేఖర్) | 0-8-0 |
| 13. | నేరస్థులు-వారిస్థితిగతులు-నేరజాతుల చరిత్ర (ఎ. ఎం. సోమసుందరం ఎం. ఏ.) | 2-0-0 |
| 14. | 1857 ప్రథమవిప్లవం - (శేఖర్) | 1-0-0 |
| 15. | జన్మభూమి-నాటకం (కాజ రాధాకృష్ణశాస్త్రి) | 1-4-0 |
| 16. | పరీక్ష - నవల (జైనేంద్రకుమార్) | 1-8-0 |
| 17. | ప్రేమలేఖలు - నవల ("ఉగ్రజీ") | 1-0-0 |

* ప్రతులు లేవు.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B132 |
| పుస్తకం పేరు | ప్రేమ లేఖలు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rehana |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |